# చైనా మహత్తర విజయాలు







# చైనా మహత్తర విజయాలు



వివిధ పత్రికల, వ్యాసాల ఆధారంతో

ఎ. బి. కె. ప్రసాద్

పరిచయం:

మద్దుకూరి చంద్రశేఖరరావు



విశాలాంధ్ర ప్రచురణాలయం,
బకింగ్‌హాంపేట పోస్టు : : విజయవాడ.



నిరుడు కాక ముందటేడు
సరకారుకు బియ్యం
కావిళ్ళకు ఎత్తి అమ్మకా
నికి కొనిపొయ్యాం.



నిరుడు పెరగపండె పంట
సరకారీ బేరం
పడవలపై వేసి కట్టు
ఏడికి బైలుదేరాం.



ఈ యేటి రవాణా పని
లారీలతో తేలదు.



వచ్చే ఏడాది కింక
రైలుబండి చాలదు.

— కృష్ణమూర్తి

# కొలతలు

| | |
|---|---|
| 1 "మౌ" | ఎకరంలో 6 వ వంతు. |
| 1 హెక్టార్ | సుమారు 2½ ఎకరాలు. 'మౌ' అంటే హెక్టార్‌లో 15 వ వంతు. |
| 1 ఎకరా | 106 టన్నులు. టన్ను 13½ బస్తాలు. |
| 1 పికల్ | 0.05 టన్నులు లేక 0.984 హండ్రెడ్‌వైట్. |
| 1 కాటీ | 0.5 కిలోగ్రాములు లేదా 1.10 పౌన్లు. |
| 1 టన్ను | 1,000 కిలోగ్రాములు. |
| 1 కిలోగ్రాం | 2½ పౌనులు. |
| 1 కిలోమీటర్ | 1000 మీటర్లు లేదా 5/8 మైలు. |
| 1 చ. కిలోమీటర్ | 1/3 చదరపు మైలు. |
| 1 యువాన్ | 2 రూపాయలు. |



1

# పరిచయం

చైనా ప్రజారిపబ్లిక్ 1949 అక్టోబరు 1 తేదీన ఏర్పడింది. గత తొమ్మిది సంవత్సరాలుగా చైనా ప్రజలు తమ దేశ పురోభివృద్ధికి కృషి చేస్తున్నారు.

ప్రజా రిపబ్లిక్ ఏర్పడిన వెంటనే మావోసేటుంగ్ నాయకత్వాన చైనాప్రభుత్వం మూడేళ్ళ జాతీయ పునర్నిర్మాణ ప్రణాళికను రూపొందించు కుంది. తద్వారా చైనా ప్రజలు అంతర్యుద్ధ కాలంలో ఛిద్రమైపోయిన పరిశ్రమలను, రవాణా సౌకర్యాలను పునరుద్ధరించుకున్నారు. వరద నివారణ పథకాలను అమలు జరిపి, ప్రతియేటా వరద ప్రమాదానికి గురౌతున్న లక్షలాది ప్రజలను, లక్షలాది ఎకరాల పంటభూములను రక్షించుకున్నారు.

1952 నుంచి '57 వరకు ద్వితీయ పంచవర్ష ప్రణాళికను అమలు జరిపారు. దేశాభివృద్ధికి కీలకమైన ఉక్కు, బొగ్గు, చమురు, యంత్ర నిర్మాణం వగైరా భారీ పరిశ్రమలను నిర్మించుకున్నారు. నదీలోయ ప్రాజెక్టులను నిర్మించుకుంటూ పంటభూములకు నీటిని అందించటంతో పాటు విద్యుచ్ఛక్తి వుత్పత్తిని పెంచుకున్నారు. ఈ ఏడేళ్ళ కాలంలో 3 కోట్ల 50 లక్షల ఎకరాల భూమికి నీటి పారుదల సౌకర్యాలను చేకూర్చుకోగలిగారంటే చైనా ప్రజలు సాధించిన మహత్తర విజయాన్ని గురించి ప్రత్యేకంగా వర్ణించనవసరంలేదు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక మొదటి సంవత్సరంలో చైనా ప్రజలు సాధించిన విజయాలు అత్యద్భుతమైనవి. 1957 అక్టోబరు నుంచి 1958 జులై మాసాంతానికి 7 కోట్ల 50 లక్షల ఎకరాల పంటభూము లకు నీటిపారుదల సౌకర్యాలను ఏర్పరచుకున్నారు. ఈ సంవత్సరం మొత్తం ధాన్యంపంట 30 - 35 కోట్ల టన్నులు. ప్రత్తిపంట 35 లక్షల టన్నులు వుంటుంది. ఇది చరిత్రలో కనివినీ ఎరుగనంతటి పెరుగు దలని ప్రతివారు గుర్తించుతున్నారు. ఆహారధాన్యాలు, ప్రత్తి పంటల్లో చైనా రిపబ్లిక్ అమెరికాను ఈ సంవత్సరం అధిగమించగలిగింది.



భారీ పరిశ్రమల్లోను, మధ్యరకపు పరిశ్రమల్లోనూ, చిన్న పరిశ్రమల్లోకూడ చైనా ప్రజలు యిదేవిధంగా ఎంతో పురోగమించారు. ఈ సంవత్సరాంతానికి 107 లక్షల టన్నుల ఉక్కు తయారౌతుంది. అలాగే యంత్ర నిర్మాణపరిశ్రమలో నూటికి 68 వంతులు అభివృద్ధి చెందింది. మూడువందల సంవత్సరాలుగా ఎంతో పారిశ్రామికాభివృద్ధిని పొందిన బ్రిటనుదేశాన్ని పదిహేను సంవత్సరాల లోపుగానే అధిగమించాలని చైనా ప్రజలు దీక్షతో పనిచేస్తున్నారు.

చైనా ప్రజా రిపబ్లిక్ 1949 అక్టోబరులో ఏర్పడింది. భారత స్వాతంత్ర్యం 1947 ఆగస్టులో సాధించుకున్నాం. మనకంటే రెండేళ్ళు వెనకాల స్వాతంత్ర్యం సాధించుకున్న చైనా ప్రజలు ఈ విజయాలను ఎలా సాధించగలిగారు? భారతీయులం అలా ఎందుకు పురోగమించలేకపోతున్నాం? మన ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు ఎందుకు కోతలు పెట్టవలసి వస్తూంది? చైనా సోదరులవలె ప్రణాళిక యెడల మన ప్రజలలో ఉత్సాహం ఎందుకు కలగడంలేదు?

అనే ప్రశ్నలు సహజంగా ప్రతిభారతీయుణ్ణి నేడు ఎదుర్కొంటున్నాయి. చైనాలోవలె భారత దేశంలోకూడ సహజ సంపదలు, వనరులు వున్నాయి. మనకూ 40 కోట్ల మానవబలగం వుంది. చైనా ప్రజాప్రభుత్వం సోషలిస్టు పంథాను స్వీకరించి, అధికలాభాలను, లంచగొండితనాన్ని, దుబారాను అరికట్టి, 60 కోట్ల ప్రజలను సమీకరించ కలిగింది. భారత దేశాభివృద్ధిని ప్రజాశ్రేయస్సును కోరేవారందరం సోషలిస్టు పంథాయెడల విశ్వాసంవున్న వారందరం కలసి దీక్ష వహించితే 40 కోట్ల ప్రజలను మనం కూడా సమీకరించగలుగుతాం. భారతదేశ సర్వతోముఖాభివృద్ధిని సాధించగలుగుతాం.

ఈ చిన్ని పుస్తకం దేశశ్రేయస్సును కోరే ప్రతి భారతీయుణ్ణి ఆలోచించునట్లు చేస్తుందని ఆశించుతాను. చైనా ప్రజల అనుభవాలను పాఠకులకు అందించిన రచయితకు అభినందనలు.

విజయవాడ, ఇట్లు
25 అక్టోబరు, 1958. మద్దుకూరి చంద్రశేఖరరావు

# విషయసూచిక





---

## సవరణ

12 వ పేజీలో 420 "మా" లు అనిగాక, 42 కోట్ల 'మా' లు అంటే 7 కోట్ల ఎకరాలని చదువుకోవాలి.

1వ ప్రకరణ

# వ్యవసాయం

## జయప్రదంగా ఆహారసమస్య పరిష్కారం

శతాబ్దాల భూస్వామ్య, అర్ధ భూస్వామ్య, వలస దోపిడీ నుంచి విముక్తి పొందిన చైనా, జాతీయార్థిక రంగంలోని అన్ని శాఖలలోను బ్రహ్మాండమైన అభివృద్ధిని సాధిస్తోంది. ఈ విజయాల ప్రభావం ఎంత వరకు వుందంటే, యింత అభివృద్ధి సాధ్యమా ? అని ప్రతి ఒక్కరికి ఆశ్చర్యాన్నికలుగజేశాయి, ఈ అభివృద్ధిని ఎలాసాధించారు ? ఈవిజయాల వెనుక నున్న మహాశక్తి ఏమిటి ? పోనీ ఒకటిగాదు, రెండు గాదు, ప్రతీరంగంలోను "నమ్మ శక్యంకాని" యింతటి ఉత్పత్తిని సాధించడం కేవలం ప్రకృతి పరిస్థితులు అనుకూలంగానే వుండడంవల్ల సాధ్యమైందా? లేక ప్రకృతికి, మానవుడికిమధ్య జరిగిన పోరాటంలో ప్రకృతినే మానవుడు లొంగదీశాడా ? అన్న విషయాలు చర్చనీయాంశాలు. ఆశ్చర్యకరమూ, ఆనందదాయకమూ, అనుసరణీయమూ అయిన ఈ విజయాల్ని గూర్చి తెలుసుకోవడం అవసరం.

నవచైనాలోని గ్రామీణ ప్రాంతాలన్నీ ఈ సంవత్సరం అత్యద్భుత విజయాల్ని సాధించాయి. ఈ సంవత్సరంతో చైనా ఆహారసమస్య తీరి పోయినట్లే. ఈఏడు వేసవికాలపు పంటలు కనీ వినీ ఎరుగనంతగా పండాయి. గత సంవత్సరం పంటకన్నా ఈ సంవత్సరం 5 కోట్ల 50 లక్షల టన్నులు అధికంగా పండింది. ఈ సంవత్సరం ముంగారువంట

4 కోట్ల టన్నులకన్నా హెచ్చు పండింది. ఇది 1957 సంవత్సరం పంట కన్నా రెట్టింపు. మొదట్లో వేసిన అంచనాలప్రకారం తేలిందేమంటే— అన్నిరకాల ఆహారపంటల మొత్తం ఉత్పత్తి 30 కోట్లనుండి 35 కోట్ల వరకు వుంటుంది. ఈ మొత్తం గత సంవత్సరం పంటకన్నా 60 నుండి 70 శాతం హెచ్చన్నమాట. (బహుశా రెట్టింపుకూడా వుండొచ్చు). ఈ సంవత్సరం పత్తిపంటకూడా గత సంవత్సరపు పంటకన్నా రెట్టింపు వుంటుంది. అంటే ఈ సంవత్సరం 3? లక్షల 50 వేల టన్నుల పత్తి ఉత్పత్తి అవుతుందన్నమాట.

ఇంతకు ముందెన్నడూ ఎరుగని యింత పంట పండటంతో, చైనా ఆహారకొరత తీరిపోయినట్లే. దేశం మొత్తంమీద చూస్తే సగటున తల ఒక్కింటికి సుమారు 7 బస్తాల ధాన్యం చొప్పున పండింది. కొన్ని రాష్ట్రాల్లోను, స్వపరిపాలిత ప్రాంతాల్లోను తల ఒక్కింటికి సుమారు 10 బస్తాలవరకు కూడా పండింది. ఈ సంవత్సరం వ్యవసాయోత్పత్తిలో వచ్చిన అభివృద్ధి చరిత్రలోనే అపూర్వమైన విషయం. సోషలిస్టు నిర్మాణంలో కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన సాధించిన బృహత్తర విజయమే యిదంతా.

ఈ సంవత్సరం జూన్‌లో చైనా అధ్యక్షులు మావోని యింగ్చి సహకారవ్యవసాయ సంఘాధ్యక్షుడు కలుసుకున్నప్పుడు ఈక్రిందిలక్ష్యాల్ని చేరుకోవాలని ఆయన చెప్పాడు: దేశవ్యాపితంగా తల ఒక్కింటికి దాదాపు 10 బస్తాల ధాన్యం; 110.23 పౌనుల పందిమాంసం, షుమారు 22 పౌనుల పింజతీసిన దూది. ఈ లక్ష్యాన్ని వచ్చే సంవత్సరమే సాధ్యమయినంత త్వరితగతిని సాధించడానికి చైనా ప్రజలు ఉద్యుక్తులవుతున్నారు. చైనా రైతాంగం ఈ సంవత్సరం వ్యవసాయోత్పత్తిలో గడించిన అనుభవాల్ని బట్టి చూస్తే చైనా ప్రజలకు అవసరమైన వ్యవసాయ సరుకులన్నీ అనతి కాలంలోనే అంటే దాదాపు మూడు సంవత్సరాలలోనే ఉత్పత్తి అవుతాయని, ప్రజల అవసరాలు తీరుతాయని స్పష్టంగా చెప్పుకోవచ్చు. అందు చేతనే ఈ సంవత్సరం సాధించినదానికన్నా వచ్చే సంవత్సరం చైనా రైతులు యింకా బ్రహ్మాండమైన విజయాల్ని సాధించేందుకు సిద్ధమవుతున్నారు.

వచ్చే ఏడాది వ్యవసాయోత్పత్తి యింకా అధికంగా సాగాలంటే, వచ్చే శీతాకాలం, వసంతఋతువులలో గ్రామీణప్రాంతాల్లో సోషలిస్టు, కమ్యూనిస్టు శిక్షణ వ్యాప్తి చెందించాలని కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ దేశంలో ఆధీన శాఖలన్నింటికి ఒక ఆదేశమిచ్చింది. దాన్ని తు.చ. తప్పకుండా అనుసరించాలని విజ్ఞప్తి చేసింది. ఇటువంటి వాస్తవ విషయాలన్నీ ముఖ్యంగా ఈ సంవత్సరంలో సాధించబడ్డ బ్రహ్మాండమైన వ్యవసాయోత్పత్తి విజయాలు ఒక విషయాన్ని స్పష్టంచేస్తున్నాయి. ఏమంటే - కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం నానాటికి బలోపేతం గావడం ద్వారాను. రాజకీయాలకు అధికతర ప్రాముఖ్యత నివ్వడంవలనను. ప్రతి సమస్యలోను విజయంసాధించడానికి హామీ లభిస్తోంది. చైనాదేశమంతటా సాగిన 'కార్యవిధాన సంస్కరణోద్యమం'(Rectification Campaign) ద్వారాను. మితవాద శక్తులకు వ్యతిరేకంగా సాగిన పోరాటం ద్వారాను లభించిన విజయాల్ని ఊతగా తీసుకున్న కమ్యూనిస్టుపార్టీ - గత సంవత్సరం శీతాకాలంలో గ్రామీణ ప్రాంతాలన్నిటా బ్రహ్మాండమైన సోషలిస్టు శిక్షణా ఉద్యమాన్ని. పెట్టుబడిదారీ పంథాకు వ్యతిరేకమైన సోషలిస్టు పోరాటాన్ని పెద్ద ఎత్తున నడిపింది. ఈ సంవత్సరం భారీ ఎత్తున కొనసాగే సోషలిస్టు నిర్మాణానికి సంబంధించిన 'సాధారణ కార్యక్రమం'వైపు కమ్యూనిస్టుపార్టీ ప్రజల్ని బాగా సమీకరించ గల్గింది.

> బ్రహ్మాండమైన ఈ సిద్ధాంత కార్యక్రమంద్వారా సహకార రైతాంగ ప్రజల్లో అత్యధిక సంఖ్యాకుల రాజకీయ చైతన్యస్థాయి పెరిగింది. దీని ఫలితమే ఈ సంవత్సరం వ్యవసాయోత్పత్తిలో సాధించబడ్డ అమోఘ విజయాలవెనుక నున్న ప్రాథమిక చైతన్యశక్తి.

గ్రామీణ ప్రాంతాలన్నింటా సోషలిస్టు, కమ్యూనిస్టు శిక్షణా ఉద్యమాన్ని నడుపవలసిందిగా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ దేశంలోని పార్టీ శాఖలన్నింటికి పిలుపు నిచ్చింది. అధిక సంఖ్యాక రైతాంగ ప్రజల రాజకీయ చైతన్యస్థాయిని పెంపొందించడమూ, వారి ఆలోచనా విధానాల్లో ఆరోగ్యకరమైన మార్పుల్ని గొనివచ్చేందుకు. వచ్చే సంవత్సరం యింతకన్నా. బ్రహ్మాండమైన విజయాల్ని సాధించడంలో కమ్యూ

నిస్టు చైతన్యాన్ని ఉద్దీంపిపజేయడమే ఈ ఉద్యమ మహాలక్ష్యంగా వుంది.

పెద్ద ఎత్తున జరిగే సోషలిస్టు - కమ్యూనిస్టు శిక్షణా మహోద్యమం 50 కోట్ల రైతాంగ ప్రజల్ని సోషలిస్టు చైతన్య ప్రదీప్తుల్ని చేస్తుంది. కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి కావలసిన నైతిక విలువలకు ప్రాతిపదిక వేస్తుంది. ప్రజల్లో రానున్న ఈ మార్పులన్నీ ప్రకృతినే మార్చడానికి, సోషలిస్టు ఉత్పత్తిని త్వరితగతిని అభివృద్ధి పరచడానికి ఒక గొప్ప భౌతికశక్తిగా ఉపకరిస్తుంది.

గత సంవత్సరం శీతాకాలంలో గ్రామీణ ప్రాంతాల్లో కల్పించబడ్డ నీటి పారుదల సౌకర్యాలవల్ల ఈ సంవత్సరం అద్భుత ఫలితాలు కలిగాయి. సాగుకు లాయకైన మొత్తం భూమిలో సగభాగానికి వర్షాభావం, వరద తాకిడి బెడద తప్పిపోయింది. వచ్చే రెండు శీతాకాలాలలోను వసంత రుతువులలోను కష్టించి పనిచేస్తేనేకాని మొత్తం సాగుభూమి కంతా నీటి వనర్లు కల్పించడం సాధ్యంకాదు. అందుచేత రైతాంగమంతా యింకా ఎక్కువ చొరవతో పని చేయాలని చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ పిలుపు నిచ్చింది. ఫలితంగా చైనా వ్యవసాయోత్పత్తిక్రమంలో మరో నూతన శకోదయం అవుతుంది.

చైనా వ్యవసాయోత్పత్తికి సంబంధించినవి 5 ప్రధాన సమస్యలున్నాయి: నీటి పారుదల, ఎరువులు, భూమి, విత్తనాలు, వత్తుగా నారు నాటడం. వీటన్నిటిలోకి ప్రధాన సమస్య భూమికి సంబంధించినది దుక్కి లోతుగా దున్నడమన్నమాట. కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ చెప్పినట్లు వచ్చే శీతాకాలం, వసంతరుతువు పంటల్లో లోతుగా దున్నడమనేది అతి ప్రధాన విషయంగా వుంటుంది. అలాగే భూసారాన్ని అభివృద్ధిచేయడంకూడా ఎంతో అవసరమని చైనా రైతులు భావిస్తున్నారు.

ఈ సంవత్సరం వ్యవసాయోత్పత్తిలో సాధించిన అద్భుత విజయాలు - లోతుగా దున్నవలసిన అవసరాన్ని మరింతగా నొక్కి చెపుతున్నాయి. ఈ విషయమై రైతాంగమంతా శ్రద్ధవహించేటట్లు దేశంలోని పార్టీశాఖలన్నీ కదలి మొత్తం పార్టీ సభ్యుల్ని, ప్రజల్నీ సమీకరించి.

లోతు దుక్కి విషయంలోనూ, భూసార అభివృద్ధి విషయంలోనూ బ్రహ్మాండమైన విప్లవాన్ని తీసుకురావాలని పార్టీ కేంద్రకమిటీ ఆదేశించింది.

ఈ సంవత్సరం (1958) వ్యవసాయోత్పత్తిలో చైనా రైతాంగం అమోఘమైన విజయాల నెలా సాధించారో ఈ క్రింది ఉదాహరణలు స్పష్టంచేస్తున్నాయి:

హూపే రాష్ట్రంలో ఒక ఆదర్శ వ్యవసాయ క్షేత్రంలో యకరానికి 1812 బస్తాల (166 పౌనుల బస్తాలు) వరి ధాన్యం పండించారు. ఒక 'మా' (ఎకరంలో ఆరవవంతు) భూమిలో యీ పరిశోధన జరిగింది. 14½ అంగుళాలలోతున పొలం దున్నారు. 275 పౌనుల విత్తులను ఉపయోగించారు. 4 లక్షల 28 వేల వరిమొక్కలను నాటారు. అనేకసార్లు ఎరువువేశారు. కొన్ని దుబ్బులు 24 కంకుల వరకు వేశాయి. కొన్ని కంకులలో ఒక్కొక్క దానికి 240 వడ్లగింజలదాకా వున్నాయి. సగటున కంకికి 170 గింజల వరకు పండాయి.

అలాగే మరో ఉదాహరణ: ఉత్తర క్వాంటుంగ్ రాష్ట్రంలో **17** సెంట్ల కొండ భూమిని సాగుచేసి పరిశోధన జరపగా **412** బస్తాల ధాన్యం పండింది. అంటే ఎకరాకు **2,450** బస్తాల చొప్పున పండిందన్న **మాట.** ఇంత పంట ప్రపంచంలో ఇదివర కెన్నడూ ఏ దేశంలోనూ **పండలేదు.**

హెచ్చు పంటలు పండించే పద్ధతులను గురించి పరిశోధించడంకోసం టీన్‌పై సహకార వ్యవసాయ సంఘంవారు యీ మడిని సాగుచేశారు.

దీంట్లో దాళవా వూడ్చారు. కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శిగా కూడా వున్న సహకార సంఘం అధ్యక్షుని నాయకత్వాన ఆ సంఘ ఉపాధ్యక్షుడూ, మరో 200 మంది ఉత్సాహవంతులైన రైతు యువకులూ ఒక దళంగా ఏర్పడి యీ మడిలో సేద్యం చేశారు.

జూలై నెల మధ్యలో 13 అంగుళాలలోతున దున్ని కంపోస్టు, పచ్చి ఆకు మున్నగు పలువిధాలైన ఎరువులు 30 టన్నులు వేశారు. ఆ తర్వాత

పక్క పొలం పదిన్నర ఎకరాల్లో నుంచి పొట్టమీద ఉన్న వరిమొక్క లన్నీ తీసుకొచ్చి ఇందులో నాటారు. ఇవి 8 లక్షల దుబ్బులున్నాయి. బాగా ఒత్తుగా ఉండటంవల్ల చాలినంత శుభ్రమైన గాలి జొరబడక, నాటిన కొద్దిరోజులకు మొక్కలన్నీ పసుపురంగు వేశాయి. మొక్కకూ, మొక్కకూ మధ్య సందు తక్కువగా వుండటంవల్ల వేడి ఎక్కువై మొక్క పెరగడానికి ప్రతిబంధకమైంది. అది కనిపెట్టి, సహకార సంఘం సభ్యులు ఆ మడిచుట్టూ గడలు పాతి వెదురు తడికలను వేళ్లాడ కట్టారు. వాటికి తాళ్ళు కట్టి, ప్రతిరోజూ సాయంత్రం పూట పైరుకు బాగా గాలి తగలడంకోసం పంకాలవలె లాగుతుండేవారు. మడిలోకి చల్లటి నీళ్లుపెట్టి. వేడి తగ్గించడంకోసమని ఏ రోజుకారోజు వాటిని మళ్ళీ బయటకు వదలిపెడుతుండేవారు. 163 పౌనుల అమోనియా సల్ఫేటును కూడా నీళ్ళలో కలిపివేశారు. అయిదురోజుల్లో పైరు పచ్చ బడింది. అక్కడ నుంచి క్రమేణా పెరుగుదల కన్పడింది.

ఆగస్టు నెలాఖరుకు పంట కొచ్చింది. పంటను చూచి స్థానిక రైతులు య 1 కి 2 వేల బస్తాల చొప్పున పండుతుందని అంచనా కట్టారు. ఈ వార్త జిల్లా అంతా పొక్కింది. దూరదూరాలనుంచి యాత్రగా ఎంతోమంది చూడవచ్చారు.

ఆగస్టు 30 వ తేదీన నూర్చారు. నూర్పిడిలో 300 మందికి పైగా రైతు యువకులు పాల్గొన్నారు. నూర్చడానికి ఒకటిన్నర రోజు పట్టింది. మామూలుగా అయితే ఇంతమడిలో పండినదాన్ని ఒకరిద్దరు మనుష్యులు ఒక రోజులో నూర్చేవారు.

ఈ విధంగా పైన సాధించిన విజయాన్ని యావత్తు చైనా ఆర్థిక సాంస్కృతికాభివృద్ధికి ప్రోత్సాహాన్నిచ్చాయి. ఇకముందు కూడ అలా యిస్తుంటయి. వ్యవసాయం పెంపొందడంవల్ల లఘుపరిశ్రమలకు కావలసినంత ముడివస్తువులు లభిస్తాయి. ఆ ముడిసరుకులను వినియోగించి లఘుపరిశ్రమలు పెంపొందుతున్న ప్రజల అవసరాల్ని తీర్చేందుకై వేగంగా ఉత్పత్తిని అభివృద్ధి చేస్తాయి. వ్యవసాయం, లఘుపరిశ్రమలు పెంపొందడంతో, భారీపరిశ్రమల అభివృద్ధికి మహత్తరమైన అవకాశాలు

ఏర్పడతాయి. ఈ విధంగా అభివృద్ధి పొందిన భారీపరిశ్రమలు వ్యవసాయానికీ, లఘుపరిశ్రమలకూ అవసరమయిన వస్తువులను ఉత్పత్తి చేస్తుంటాయి. ఈ విధంగా వ్యవసాయం, లఘుపరిశ్రమలు అత్యంత వేగంతో అభివృద్ధి పొందడానికి అనుకూల పరిస్థితు లేర్పడుతున్నాయి. వ్యవసాయంలో యంత్రాలను ప్రవేశపెట్టి, వ్యవసాయ రంగానికి విద్యుచ్ఛక్తి సౌకర్యాలను కల్పించడానికి, లఘుపరిశ్రమల్లో ఆధునిక యంత్ర పరికరాలను ప్రవేశపెట్టడానికీ పైన చెప్పిన అభివృద్ధి ప్రాథమికంగా అవసరమవుతుంది. చైనాపారిశ్రామికవంతమవడం, సాంస్కృతికాభివృద్ధి త్వరితగతిని సాగిపోవడానికి. వ్యవసాయం వేగంగా అభివృద్ధి పొందడం అవసరమన్నది నిర్వివాదాంశం.

ఈ విజయాలు, చైనాలో వ్యవసాయోత్పత్తిని వేగంగా అభివృద్ధి జేయడం అసాధ్యమని ప్రజల మనస్సుల్లో ఉంటూ వచ్చిన పాతభావాలన్నింటినీ పటాపంచలు గావించాయి. ప్రకృతి పరిస్థితుల్ని త్వరితగతిని మార్చడం సాధ్యమవుతుందని ఇప్పుడు రుజువు చేయబడింది. 1958 సంవత్సరం వేసంగిలో సాధించబడ్డ సమృద్ధికరమైన పంటలు మైదాన ప్రాంతాలు, ప్రకృతి పరిస్థితులు అనుకూలంగా ఉన్న ప్రాంతాలలోనే గాక, ప్రకృతి పరిస్థితులు అనుకూలంగాలేని పర్వతప్రాంతాలు, తదితర ప్రాంతాలలో కూడా పండించబడ్డాయి. ఎక్కువ సంఖ్యలో ట్రాక్టర్లు, ఎక్కువ మొత్తాలలో రసాయనిక ఎరువులు లేకపోయినప్పటికీ. ప్రజల సృజనాత్మక శక్తిపైన. వారి ఉత్సాహంపైనా, నీటిపారుదల పద్ధతుల పైనా ఆధారపడినట్లయితే అత్యధికంగా పంటను సాధించవచ్చునని నేడు రుజువయింది.

వ్యవసాయరంగంలో సాధించిన ఈ విజయాలు యాదృచ్ఛికంగా సంభవించినవి కావని గుర్తించాలి.

# ప్రకృతి అనుకూలంగా లేకపోయినా.........

ప్రకృతి పరిస్థితులు, వాతావరణం అనుకూలంగా ఉండడం మూలాన యీ సంవత్సరం యిలాంటి ధారాళమైన పంట పండిందని కొందరంటున్నారు. నిజానికి ఈ సంవత్సరం చైనా ప్రకృతి పరిస్థితులు అంత అనుకూలంగా లేవు. గోధుమ పంట పండే అనేక ప్రాంతాల్లో విత్తునాటు కాలంలో ఈ సంవత్సరం వాన కురవలేదు. గోధుమ పంట పెరుగుతున్నకాలంలో గూడా కొన్నిచోట్ల వానలు ఎక్కువయ్యాయి. మరికొన్నిచోట్ల వడగండ్ల వానలు, తీవ్రమైన మంచు కురిశాయి. ఈ ప్రతికూల పరిస్థితులకు వ్యతిరేకంగా ప్రజలు నిరంతరం పోరాటం కొనసాగించడంవల్లనే ధారాళమైన పంట సాధ్యమైంది. ఇది నిజంగా వ్యవసాయ రంగంలో ఒక "స్పుత్నిక్". ఉదాహరణకు హోపేరాష్ట్రం విషయం తీసుకోండి. ఈ రాష్ట్రంలో 1957 వర్షాకాలంలో 155 మిల్లీ మీటర్ల వర్షం మాత్రమే కురిసింది. నాట్లు మొదలుకొని కోతలవరకు గడిచిన తొమ్మిది మాసాల్లో గూడా అవసరమైన వర్షాలు కురవలేదు. అయినప్పటికీ తీవ్రమైన కృషి ఫలితంగా యిక్కడ పంట 77 శాతం అధికంగా పండింది. గత శీతాకాలం నుండి ఈ సంవత్సరం జూన్ మాసంవరకు గడచినకాలంలో దేశంలో 420 "మౌ" ల (ఒక "మౌ" ఎకరంలో 6 వ వంతు) భూమి సేద్యంలోకి తీసుకొని రాబడింది. 3,200 కోట్ల టన్నుల ఎరువులు వేయబడ్డాయి. భూమి లోతుగా దున్నబడింది. మంచి విత్తనాలు ఉపయోగించబడ్డాయి. సేద్యపు పద్ధతులు, వ్యవసాయ పనిముట్లు అభివృద్ధిలోనికి తీసుకురాబడ్డాయి.

# యంత్రాలతో వరినాట్లు

ఈ సంవత్సరం అభివృద్ధి ఇలావుంటే, చైనాలో వచ్చే సంవత్సరం నాట్లు వేసేపనిని చాలవరకు యంత్రాలే చేస్తాయి. దేశంలో వివిధ ప్రాంతాల్లోని ఫ్యాక్టరీలలో 46 రకాల వరినాట్ల యంత్రాలు తయారైనాయి. ఈ యంత్రాలు చాల సమర్ధవంతంగా పనిచేస్తాయి. వీటిలో చాల యంత్రాలు "మౌ" ఒక్కొంటికి సాధారణంగా 50 వేల నారుదుబ్బులను

నాటగలవు. అవసరమయితే మూడు లక్షలనుండి 18 లక్షల దుబ్బులు వరకు నాటగలవు. వరినాట్లు యంత్రాలను తయారుచేయడం చైనాలో 1952 లోనే ప్రారంభమైంది. చెకియాంగ్. కియాంగ్సీ మొదలైన 14 రాష్ట్రాలలో జరిపిన సర్వేనుబట్టి ఈ యంత్రాలు 689 రకాలు తయారై



వరినాట్ల యంత్రం; మామూలుగా చేతితో వూడ్చేపనికన్నా ఈ యంత్రం 30 రెట్లు ఎక్కువ పనిచేస్తుంది.

నాయని తేలింది. వీటిలో చాలభాగం స్థానిక కార్మికులూ, రైతులూ తయారు చేసినవే.

## ఇతర పంటలు

పత్తిపంట: చైనాలో ఈ ఏడాది పత్తికూడా కనీ వినీ ఎరుగనంత ఎక్కువగా పండింది. ఈ ఏటి పంట 35 లక్షల టన్నులని అంచనా. ఇది నిరుటికన్నా రెండు రెట్లకు పైగా వుంది.

ఇది అమెరికా పంటకన్నా కూడా హెచ్చు. అమెరికా పత్తి పంట ఈ ఏడాది 20 లక్షల టన్నులు మాత్రమే వుంటుందని అంచనా. ఎక్కువ నేలలో పైరు వేయడం. కొత్త పద్ధతులను చేపట్టడంవల్ల యీ పంట హెచ్చిందని చైనా రైతుల అనుభవం.

ఉదాహరణకు పుకీన్ రంగంలోని నానాన్ కాంటీలో మన్‌షాన్ హాంగ్ వ్యవసాయ సహకార క్షేత్రంలో ఎకరానికి 34 టన్నుల పత్తి పండించారు. చైనాలో ఇంతకుముందుగల పత్తిపంట రికార్డుకు ఇది 5 రెట్లు ఎక్కువ.

మన్‌షాన్‌హాంగ్ సహకార వ్యవసాయ క్షేత్రంవారు 1.021 మౌ ప్లాటులో జరిపిన ప్రయోగం ఫలితంగా ఈ రికార్డు స్థాపితమయింది.

ఈ ప్లాటును పదహారు అంగుళాల లోతున ఏడుసార్లు దున్నారు. విత్తనాలు వత్తుగా జల్లారు. ఎకరంలో ఆరోవంతు భాగమైన ఈ ప్లాటులో లక్ష 70 వేల పత్తి మొక్కలు కలవు. పాటిమన్నుతో సహా మొత్తం 380 టన్నుల ఎరువులు వాడారు. ఎరువుగావాడిన వాటిల్లో గడ్డి బూడిద కూడా కలదు.

మొక్కజొన్న: హోనాన్ రాష్ట్రంలోని షాంగ్‌క్యూ మండలంలో వాంగ్‌లూ ప్రజా కమ్యూన్‌వారు హెక్టరుకు 265.4 టన్నులయ్యే మొక్కజొన్న పండించి చైనాలో కొత్తరికార్డు సృష్టించారు.

గోధుమ: చైనాలో వరి ప్రథమ పంటే అయినా, గోధుమ ఉత్పత్తిలో కూడా అమెరికాను మించిపోయింది. ఈ రోజున ప్రపంచ

గోధుమ ఉత్పత్తిలో సోవియట్ తరువాత చైనాదే ద్వితీయస్థానం. ఈ సంవత్సరం చైనాలో గోధుమ పంట 3 కోట్ల 89 లక్షల 50 వేల మెట్రిక్ టన్నులు పండింది. ఇది అమెరికా ఉత్పత్తికన్న 23 లక్ష 85 వేల టన్నులు అధికమన్నమాట. ఒక్క శీతకాలపు గోధుమ పంటనే తీసుకున్నా, చైనా ఉత్పత్తి చేసింది 3 కోట్ల 44 లక్షల 50 వేల టన్నులని తేలింది. అంటే వాషింగ్టన్‌లోని వ్యవసాయ శాఖవారు ప్రకటించిన లెక్క ప్రకారమే చైనా గోధుమ ఉత్పత్తి 37 లక్షల టన్నులు అదనంగా పండింది అన్నమాట. పైగా మరో విశేషమేమంటే అనుకూలంగా లేని వాతావరణ పరిస్థితుల్లోనే చైనా ఈ అభివృద్ధిని సాధించిందని గుర్తించాలి.

ఉదాహరణకు చైనాలోని హోనాన్ రాష్ట్రంలో రైతులు గోధుమ ఉత్పత్తిలో అత్యద్భుత విజయాలను సాధిస్తున్నారు. ఈ సంవత్సరం చైనా దేశంలోని అన్ని రాష్ట్రాలకంటే హోనాన్ రాష్ట్రంలో రైతులు అత్యధిక గోధుమ పంటను పండించారు. ఈ రాష్ట్రంలో 95 లక్షల 30 వేల టన్నుల గోధుమను ఈ సంవత్సరం పండించారు. ఈ పంట గత సంవత్సరంకన్నా 57 లక్షల టన్నులు అధికం. గత సంవత్సరం కంటే ఈ సంవత్సరం హెక్టారుకు 2½ రెట్లు ఎక్కువ ఉత్పత్తి చేశారు; (హెక్టారు అనగా 2-45 ఎకరాలు; టన్ను అనగా 13½ బస్తాలు).

ఈ సంవత్సరం తాము గోధుమ ఉత్పత్తిలో సాధించిన అత్యద్భుత విజయాలను కూడా అధిగమించి వచ్చే సంవత్సరం మరింతగా పండించడానికి హోనాన్ రాష్ట్రంలోని రైతులు దీక్షబూనారు.

నేడు హోనాన్ రాష్ట్రంలో వ్యవసాయ క్షేత్రాలను లోతుగా దున్నటం ఒక ఉద్యమంగా అభివృద్ధి చెందుతున్నది. ఈ ఉద్యమంలో 85 లక్షల మంది రైతులు పాల్గొంటున్నారు. ఈ ఉద్యమంలో రోజు రోజుకూ రైతులు ఎక్కువగా చేరుతున్నారు.

రైతులు 15 అంగుళాల లోతుకు మించి భూమిని దున్నుతున్నారు. కొన్ని వ్యవసాయ క్షేత్రాల్లో 2 నుండి 3 అడుగుల లోతు

వరకు భూమిని దున్నుతున్నారు. పరిశోధన క్షేత్రాలలో $5\frac{1}{2}$ అడుగుల నుండి 11 అడుగుల లోతువరకు దున్నుతున్నారు.

హోనాన్ రాష్ట్రంలో ప్రత్యేకంగా ఒక సంస్థను ప్రభుత్వం స్థాపించింది. ఈ సంస్థ ప్రత్యేకంగా భూమిని లోతుగా దున్నటానికి సంబంధించిన విషయాలపై రైతులకు సూచనలు చేస్తుంది. కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు, ప్రభుత్వ కార్యకర్తలు భూమిని లోతుగా దున్నే విషయంలో ప్రత్యక్షంగా శ్రద్ధ తీసుకుంటున్నారు. వారుకూడా రైతులతో కలిసి దున్నుతున్నారు. ప్రజాకమ్యూనులు భూమిని లోతుగా దున్నటానికి ప్రత్యేక రైతు దళాలను కేటాయిస్తున్నాయి.

లోతుగా దున్నటంతోపాటు, నేలలో పొరతరువాత పొరకు ఎక్కువగా ఎరువులు వాడుతున్నారు. హెక్టారుకు కనీసం 375 టన్నులు ఎరువులు వాడుతున్నారు. కొన్ని ప్రత్యేకక్షేత్రాల్లో హెక్టారుకు 750 టన్నులు మించకుండా ఎరువులు వాడుతున్నారు.

ఎరువులు సిద్ధపరచటానికి ప్రత్యేక దళాలు పనిచేస్తున్నాయి. ఇప్పటికి 150 కోట్ల టన్నులు ఎరువును ఈ దళాలు తయారుచేశాయి. మరో 150 కోట్ల టన్నులు ఎరువు ఈ నెలాఖరకు తయారవుతుంది. 2 లక్షల చిన్న తరహా ఫ్యాక్టరీలు రసాయనిక ఎరువులు తయారుచేయటంలో నిమగ్నమయ్యాయి.

నారు వొత్తుగా నాటటం మరో ముఖ్యవిషయం. ఒక హెక్టారుకు 495 పౌన్లనుండి 825 పౌన్లవరకు విత్తనాలు అవసరం అవుతున్నాయి. మేలురకం విత్తనాలను రైతులు వాడుతున్నారు.

## వ్యాపార పంటలు

పుగాకు, 'రామీ,' తేయాకు మొదలైన వ్యాపారపంటల ఉత్పత్తి కూడ చాల అధికంగా సాగుతోంది. చైనా వ్యవసాయ మంత్రిత్వశాఖ వారు ప్రకటించిన లెక్కల్ని బట్టి పొగాకు ఉత్పత్తి గత సంవత్సరంకన్న ఈ సంవత్సరం 4 రెట్లు అధికంగా వుంటుంది. రామీపంట 80 శాతం

అధికంగా పండుతుంది. అలాగే తేయాకు 30 శాతం అధికంగా ఉత్పత్తి అవుతుంది. జనపనార, బీటు పంచదార, చెరకు ఉత్పత్తి ఎన్నో రెట్లు పెరుగుతుంది.

పండ్లుకూడా - ఏపిల్స్, నారింజ, పియర్స్, అరటి, ద్రాక్షలు - గత సంవత్సరంకన్నా చాల అధికంగా పండుతాయి.

ఈ సంవత్సరం పొగాకు బాగ పండడానికి చైనా రైతులు ఈక్రింది కారణాలు చెపుతున్నారు; సకాలంలో మొక్క నాటడం; తెగుళ్ళ నివారణ; లోతుదుక్కి, తక్కువ ప్లాటులోవున్న వనర్లన్నింటినీ వినియోగించడం; ఎక్కువ ఎరువులవాడకం; తగిన నీటిపారుదల సౌకర్యం - ఇవి పొగాకు పంట అంత ఎక్కువగా పండటానికి కారణాలు.

తేయాకు ఉత్పత్తిలో 1962 నాటికి చైనా ప్రపంచంలోకల్లా పెద్ద ఉత్పత్తిదారుగా వుంటుంది. నాటికి 3 లక్షల 80 వేల టన్నుల తేయాకును ఉత్పత్తి చేస్తుందని అంచనా.

## వాతావరణ పరిశోధన కేంద్రాలు

ఇప్పటికి చైనాలోని 5 రాష్ట్రాల్లోనూ ప్రతి ప్రాంతానికి, తాలూకాకు, గ్రామీణ జిల్లా కేంద్రానికి, ప్రజాకమ్యూన్‌కు, ప్రతి ఉత్పత్తి దళానికి నేడు వాతావరణాన్ని కనిపెట్టి రైతులకు సలహాలిచ్చేందుకై సంస్థలు ఏర్పడ్డాయి. ఈ 5 రాష్ట్రాలు యివి: హోనాన్, క్వాంగ్సీ, యూనాన్, షాంటుంగ్, హీలుంగ్'కియాంగ్.

ఈ వాతావరణ పరిశోధనా సంస్థలన్నీ వాతావరణ సూచనలు చేస్తుంటాయి. ఈ సంవత్సరం జూలై నుండి సెప్టెంబరు నెలవరకు దేశం మొత్తంమీద - పరిపాలనా ప్రాంతాల్లో (ఎడ్మినిస్ట్రేటివ్ రీజిన్స్) 53; తాలూకా స్థాయిలో 326; ప్రజాకమ్యూన్లలో (లేదా సహకార వ్యవసాయ క్షేత్రాల్లో) 12 వేల 878 వాతావరణ పరిశోధనా స్టేషన్లు నెలకొల్పబడ్డాయి. వీటికితోడు లక్ష 22 వేల 237 వాతావరణ గ్రూపుల్ని కూడా నెలకొల్పారు.

# కొత్తతరహా వ్యవసాయ పనిముట్లు

చైనా రైతులు వ్యవసాయ వృత్తిలో అద్భుత విజయాల్ని సాధించడంతోపాటు, ఇంతవరకూ వినియోగిస్తున్న వ్యవసాయ పనిముట్లలో కూడ పెద్దమార్పు వచ్చింది. అసంపూర్ణంగావున్న అంచనాల్ని బట్టి చూసినా, గత కొలది నెలల్లోనే పాతవాటి స్థానే కొత్తతరహా వ్యవసాయ పనిముట్లు కనిపెట్టబడ్డాయి. పాతవాటిని కొత్తపద్ధతుల్లో అభివృద్ధి చేయడం కూడ జరిగింది. ఇవన్నీ కలసి యిప్పటికి లక్ష రకాల వ్యవసాయ పనిముట్ల వరకూ తయారైనాయి. వీటిలో ఇరిగేషన్ పంపులు, బండ్లు, బండి పట్టాలు పళ్ళెపునాగళ్ళు వగైరాలు కూడ వున్నాయి. అలాగే మొక్కలకు, పంటల రక్షణకు సంబంధించిన పరికరాలు; పశుపెంపక సామగ్రి; ఉత్పత్తి అయిన వ్యవసాయ సరుకుల్ని బాగుచేసేందుకు మెషీన్లు, తదితర యంత్ర సామాగ్రి, పవర్ మెషిన్లు, కలప యింకాయితర వ్యవసాయ పనిముట్లు ఈ జాబితాలోకే వస్తాయి.

ధాన్యం, పత్తి, తదితరరకాల వ్యవసాయ సరుకుల ఉత్పత్తిలో అనుకున్న లక్ష్యాల్ని సాధించగలగాలంటే, ఇంతకన్నా యెక్కువగా నీటిపారుదల సౌకర్యాలు, చిన్న పెద్దతరహా ప్రాజెక్టులు నిర్మించుకోవలసిన అవసరం వుందని చైనా రైతులు బాగా గుర్తించారు. అంతేకాదు. అధికోత్పత్తికి విరివిగా ఎరువులు వాడడం, భూసార పరిస్థితి అభివృద్ధి పర్చడం కూడా ఎంతో అవసరమని గ్రహించారు. ఇన్నిరకాల అభివృద్ధి సాధించాలంటే జనం ఎక్కువగా వుండాలిగదా మరి. చైనా గ్రామీణ ప్రాంతాల్లో అప్పుడే అంగబలం కరువైపోయింది! ఉదాహరణకు హోనాన్ రాష్ట్రంలో ఉత్పత్తి లక్ష్యాల్ని సాధించాలంటే 440 కోట్ల పని రోజులు అవసరమయ్యాయి. రోజూ పనిచేసేవారు 1 కోటి 20 లక్షల మంది వున్నారు. అంటే ప్రతి ఒక్కడు 1957 నవంబరు నుండి 1958 జూన్ మాసం వరకూ 360 రోజులూ పనిచేస్తూనే వుండాలన్న మాట! ఎంత కష్టం మరి. పాత పద్ధతుల్లోనే ప్రస్తుత ఉత్పత్తి లక్ష్యాల్ని చేరుకోవాలంటే సాధ్యంకాని విషయం. ఏమైనా, సాహసవంతులైన

కష్టించి పనిచేసే చైనా రైతాంగానికి సాధించలేనిదంటూ లేదని తేలి పోయింది. ఇంక కష్టాలకు తలొగ్గడమనే సమస్యే లేదు. ఈ ఉత్సాహంతోనే నేడు చైనా రైతాంగం బృహత్తర కార్యక్రమాల్లో నిమగ్నులై వున్నారు. తమ కష్టాల్ని అధిగమించడంలో చైనారైతాంగం అంతులేని తెలివితేటలు అక్కరకు వస్తున్నాయి. ఒకవైపున విప్లవాత్మక కృషితో పురోగమించాలి. అంగబలం (Man power) తక్కువగా వుండడంవల్ల వున్న శ్రమ శక్తినే వృధాపోకుండా కూడబెట్టుకోవల్సిన అవసరం ఏర్పడింది. అలాగే మరోవేపున పాత వ్యవసాయపద్ధతులకు స్వస్తిచెప్పి నూతన పద్ధతుల్ని సంతరింప చేసుకోవడం - ఇన్ని సమస్యలు నేడు



ఈ 'ట్రాక్టర్' ను అనేక పనులకు ఉపయోగించవచ్చు. దీనిని నడుపుతూనే పనిచేయించవచ్చు.

చైనా రైతాంగాన్ని ముప్పిరగొన్నాయి. ముందు నీటిపారుదల సౌకర్యాల ఏర్పాటుకు కావలసిన సాధన సంపత్తితో రైతాంగం ఉద్యమాన్ని ప్రారంభించింది. ప్రస్తుతమున్న పాత వ్యవసాయ పనిముట్లను మార్చేందుకై క్రమేణా - బ్రహ్మాండమైన ఉద్యమం పెద్ద ఎత్తున ప్రారంభమైంది. ఋతువుల్నిబట్టి వ్యవసాయ పనులు మారుతూ వుంటాయి. అలాగే పాత వ్యవసాయ పనిముట్లను మార్చడానికి ప్రారంభమైన ఉద్యమం - వ్యవసాయ సరుకుల రవాణా, నీటిపారుదల, మురుగునీటి పారుదల సౌకర్యాలు, పంటసాగు, వ్యవసాయ సరకుల నాణ్యత, తదితర రకాల వ్యవసాయ పనులకు కూడా వ్యాపించింది. ఈ విధంగా అభివృద్ధి చెందిన కొత్తతరహా పనిముట్లు అమలులోకి వచ్చాయి. నేడు వ్యవసాయ రంగానికి చెందిన ప్రతిదేశంలోనూ వీటి వినియోగాన్ని మనం చూస్తాం.

ఈ ఉద్యమంలో ప్రజలంతా పెద్ద ఎత్తున పాల్గొన్నారు. అనేక రకాల వ్యవసాయ పనిముట్లను కనిపెట్టారు. పాతవాటిని ఆధునిక పద్ధతుల్లో అభివృద్ధిపరచారు. వీటన్నిటినిబట్టి చూస్తే "నూరు పుష్పాలను వికసించనివ్వండి" అన్న నినాదం స్వరూప, స్వభావాలు మనకు గోచరిస్తాయి. ఈ విధంగా తయారైన పనిముట్లన్నీ ఎంతో శ్రమ అవసరం లేకుండానే తయారు చేయబడ్డాయి. పైగా సున్నితంగా, తేలిగ్గావుంటాయి. మోయడానికి సుళువు. వీటన్నింటినీ సాధ్యమైనంతవరకు స్థానికంగా లభించిన సామగ్రితోనే తయారుచేశారు. వీటికయ్యే ఖర్చు చూస్తే తక్కువేగాని, ఉత్పాదకశక్తి మాత్రం చాల ఎక్కువ. ఈ అభివృద్ధి అంతా చైనా సోషలిస్టు నిర్మాణ కార్యక్రమానికి అనుగుణ్యంగానే వుంది. ఏమంటే, త్వరితగతిని "ఎక్కువ ఉత్పత్తి చేయండి. సరుకు నాణ్యంగా వుండాలి. ఆర్థికంగా చూస్తే ఎక్కువ ఖర్చు కనపడగూడదు" అనేది చైనా సోషలిస్టు నిర్మాణ కార్యక్రమంలో ఒక నినాదంగా వుంది. దేశంలోని రైతాంగ ప్రజలంతా ఈ కొత్త పనిముట్లంటే చాల ఆసక్తి కనబరుస్తున్నారు. కారణం ఇవి వ్యవసాయోత్పత్తిలో బ్రహ్మాండమైన అభివృద్ధిని సాధించడమే. ఉదాహరణకు యూనాన్ రాష్ట్రంలోని చూటింగ్ ప్రాంతంలో నిర్మించబడ్డ పుషియాంగ్ రిజర్వాయర్ పథకాన్ని

తీసుకుందాం. ఈ రిజర్వాయర్ నిర్మాణ సమయంలో ఒక స్వయం చలన యంత్రాన్ని కొత్తగా కనిపెట్టారు. నిజానికి దీన్ని నడపడానికి పాత పద్ధతుల్లో అయితే 8 మంది వ్యక్తులు కావలసివచ్చేవారు. కాని ఇప్పుడు ఇద్దరు వ్యక్తులే ఆ యంత్రాన్ని నడపగల్గుతున్నారు. పోనీ పని సామర్ధ్యం ఏమన్నా తగ్గిపోయిందా అంటే లేదు. మునుపటికన్నా పని సామర్ధ్యం నేడు 3 రెట్లు హెచ్చింది. ఈ యంత్రాన్ని టాంపర్ అంటారు. ప్రతి ఒక్క 'టాంపర్' ఖరీదు 12 యువాన్లు (యువన్ అంటే రెండు రూపాయలకు సమానం)మాత్రమే. మరొకఉదాహరణ చూడండి: అన్‌వీ రాష్ట్రంలోని "టౌన్‌ఫా" అనే గ్రామంలో 'ఫాంగుంగ్' అనే సహకార క్షేత్ర మొకటి వుంది. మూడు చక్రాల ఎద్దుబండి నొకదాన్ని ఈ క్షేత్ర రైతాంగం తయారుచేసింది. ఈ బండి ఎంతమట్టినైనా మోస్తుంది. ఎంతదూరం వెళ్ళినా చెక్కుచెదరకుండా వుంటుంది. ఇది తనంతటకదే బరువుల్ని దించుకుంటుంది. దీనికి కావలసినదల్లా ఒక మనిషి, ఒక ఎద్దు వుంటే చాలు. దీనితోనే మామూలుకంటే 5 రెట్లు పని జరుగుతుంది. అలాగే హూనాన్ రాష్ట్రంలో హిన్‌చీ సహకార క్షేత్ర కార్యకర్త ఒకరు మట్టినిగాని, ఎరువుల్నిగాని ఎత్తిపోయడానికి అనువుగా వుండేటట్లు ఒక యంత్రాన్ని కనిపెట్టాడు. దీనితో కొండప్రాంతాల్లో కూడా మట్టినిగాని, ఎరువునుగాని మనుష్యులు బండ బరువును మోసుకెళ్ళకుండానే పెద్దపెద్ద గంపలతో ఎత్తిపోయొచ్చు. దీనివల్ల పని సామర్ధ్యం 15 రెట్లు పెరిగింది. పైగా దీనికయ్యే ఖర్చుకూడా ఏమంత ఎక్కువకాదు. కాన్సూ రాష్ట్రంలోని కాంకూ తాలూకా వ్యవసాయ పనిముట్ల ఫ్యాక్టరీలో పని చేస్తున్న 'చియాంగ్ యున్‌చుంగ్' అనే కార్యకర్త నీళ్ళు చిలకరించే యంత్రాన్ని ఒకటి కనిపెట్టాడు. దీనితో 20 మీటర్ల ఎత్తువరకు కూడ నీటిని పంపవచ్చు. ఈ యంత్రంతో రోజుకి దాదాపు 7 ఎకరాలు (40 'మౌ' లు : 'మౌ' అంటే ఎకరంలో 6 వ వంతు) సాగవుతుంది. మామూలు నీటిపారుదలకన్న ఈ యంత్రం 50 శాతం తక్కువ నీటినే వాడుతుంది. అంటే నీటివిషయంలోకూడా చైనా రైతాంగం ఎంత పొదుపుగా వ్యవహరిస్తున్నారో బోధపడుతుంది. కొండ ప్రాంతాల్లో ఈ యంత్రం ఎక్కువగా ఉపయోగపడు

తుంది. కారణమేమంటే నీటిని తోడేటప్పుడు కొండ ప్రాంతాల్లో అయితే క్రింద నుంచి మట్టి అంతగా పైకిరాదు. తొక్కుడు పంపు ఒకదాన్ని టాటుంగ్ సమిష్టి సహకార క్షేత్రంలోని వడ్రంగి పనివారు తయారుచేశారు. ఈ పంపును పాత మగ్గం భాగాలనుండి, పత్తిగింజల్ని వేరుచేసే యంత్రమొకటి పాతపడింది వుంటే దానిభాగాన్ని తీసి దీన్ని తయారుచేశారు. ఆ విధంగా ఎక్కడ ఏది ఉపయుక్తంగా తోస్తే దాన్ని వినియోగంలోకి తెచ్చుకుంటూన్నారు చైనా ప్రజలు. దీనంతటికీ స్థానికంగా ప్రజలు చూపే చొరవే ప్రధానకారణంగా వుంది. ఈ తొక్కుడు పంపు ఖరీదు మావుంటే 10.15 యువాన్‌లు (షుమారు 20 రూపాయలు) ఉంటుంది. ఈ పంపువల్ల రోజుకి 2 ఎకరాల వరకు సాగవుతుంది. ఒక వేపున దీన్ని నడుపుకుంటూనే మరో వేపున పాఠాలు చదువుకుంటూ వుండవచ్చు.హోనాన్ రాష్ట్రంలోని చాంగ్‌నో తాలూకాలోని ఒక గ్రామంలో "సౌన్‌చిన్ నం. 1 సహకారక్షేత్రం"వుంది. దీనిలో పని చేస్తున్న కార్యకర్త "వాంగ్‌షన్" 2 కర్రులుగల నాగలి నొకదాన్నితయారు చేశాడు. ఇది 1.2 నుంచి 1.5 అడుగులలోతు (షుమారు 18 అంగుళాలు) చొప్పున రోజుకి 3 నుండి 3.5 'మౌ' లు దున్నుతుంది. మానవశక్తి కన్నా 4 రెట్లు ఎక్కువ పనినే చేస్తుంది ఈ నాగలి. అలాగే క్వాంగ్సీ స్వపరిపాలిత ప్రాంతంలో ఊడ్పులకు ఉపయోగించే యంత్రాన్ని ఒక దాన్ని కనిపెట్టారు. ఇది వానంతటికదే మొక్కల్ని ఏరుకుని గంటకి ఒక్క 'మౌ' చొప్పున నాట్లు వేస్తుంది. ఇది మామూలుగా కూలీలు వేసే వూడ్పుకన్న 10. 12 రెట్లు సామర్థ్యంతో వూడ్పు పడుతుంది. ఈ యంత్రాన్ని తయారు చేయడం చాల సులభం. పెద్ద ఖర్చు కూడ వుండదు. ఈ యంత్రంలో ఎక్కువభాగం కొయ్యతోనే తయారు చేయబడింది.

ఇలాంటి ఉదాహరణల్ని వందల సంఖ్యలో యిచ్చుకుంటూ పోవచ్చు. ఇంతకు మనకు బోధపడేదేమంటే చైనా దేశమంతటా గ్రామీణప్రాంతాలన్నిటా బ్రహ్మాండమైన పరిణామాలు సంభవిస్తున్నాయి. ఈవిధంగా హోపే, హునాన్ రాష్ట్రాల్లోను, హూపేరాష్ట్రంలోను అనేక రకాల కొత్త వ్యవసాయ పనిముట్లు తయారవుతున్నాయి. వీటి ఉత్పా

దకశక్తి సామాన్య మానవుని శ్రమశక్తికన్నా ఎన్నోరెట్లు అధికంగా వుండడం. నేటి చైనా రైతాంగం సాధించిన అద్భుత విజయాలలో కొన్ని. మాత్రమే ఫలితంగా లక్షలాది ప్రజల శ్రమశక్తి యితర రకాల పనిపాట్లకు వుపయోగపడడానికి అవకాశం చిక్కింది.

## అనేక రకాల ట్రాక్టర్లు

పైచెప్పిన నూతన వ్యవసాయ పనిముట్లతోపాటు, స్థానికంగా వున్న చిన్న చిన్న పారిశ్రామిక సంస్థలుకూడా దాదాపు నూరు రకాల ట్రాక్టర్లను ఉత్పత్తిచేశాయి. అయితే ఈ పారిశ్రామికశాఖ లన్నింటికీ సాధనసంపత్తి ఏమన్నా అధికంగావుందా అంటే అదీలేదు. అయినా వున్న వనర్లన్నింటిని పారుపోకుండా వినియోగించడంవల్లనే ఇన్ని రకాల ట్రాక్టర్లను ఉత్పత్తిచేయడం సాధ్యమైంది. ఇరిగేషన్, డ్రెయినేజ్ పనులకు కావలసిన పంపుసెట్లను పెకింగ్, టాన్సిన్‌లలో తయారు చేస్తున్నారు. హోపే రాష్ట్రంలోని చింగ్‌యీ తాలూకాలో విద్యుత్‌కర్మాగారాల్ని నెలకొల్పుకుంటున్నారు. పైనే చెప్పినట్లుగ, గత కొలదినెలల లోను చైనా ప్రజలు సాధించిన అనేకవిజయాలలో ఇవి కొన్నిమాత్రమే. నూతన పద్ధతులకోసం ప్రారంభింపబడ్డ దేశవ్యాపిత ఉద్యమం ఎంతపని చేసిందంటే, ప్రతి ఒకరిలోను ఏదో ఒకదాన్ని కనిపెట్టాలనో లేదా ఒక సమస్యను సాధించాలనో అనే ఆలోచనాశక్తిని పురిగొల్పింది. అంచేతనే ఉద్యమం మూడుపూవులూ, ఆరుకాయలుగా పరిఢవిల్లుతోంది. ఒక్క 'చాంకో' అనే తాలూకాలోనే 138 రకాల వ్యవసాయ పనిముట్లను తయారుచేశారు. హూపేరాష్ట్రంలోని 'టాంగ్యాం' తాలూకాలో ఉద్యమ అభివృద్ధినిగూర్చి మొత్తం 13195 గురు వ్యక్తులు 13 817 సూచనలు, సలహాలు యిచ్చారు. 8058 మంది 15,192 వ్యాసాలువ్రాశారు. పనిముట్లను తయారుచేయడంలో మొత్తం 25,742 మంది పాల్గొన్నారు. 1885 మంది 2,488 పనిముట్లు తయారుచేశారు.

25 లక్షల కొత్త తరహా ఉక్కునాగళ్ళు, పళ్ళెపు దిమ్మెశలు (Disc harrows: అంటే దున్నిన నేలను లెవెల్‌చేసేందుకు వినియోగించే

పనిముట్లు. దీన్ని 'పాపటము తోలడం' అని మనం అంటాం ॥అను॥) ప్రస్తుతం వినియోగంలో వున్నాయి. వీటిని 23 కోట్ల 40 లక్షల 'మా' లలో ఉపయోగిస్తున్నారు, అంటే మొత్తం సాగు భూమిలో 13.3 శాతం



ఎద్దులాగుతున్న ఈ బండిలో ఒకతొట్టి అమర్చబడివుంది.
దీనిలో ఎరువువేసి కలబెడుతున్నాడు ఒకమనిషి.
ఈ ఒక్క పనిముట్టుతో రోజుకి 3 ఎకరాల్లో ఎరువు వేయొచ్చు.

భూమిలో ఈ కొత్త పనిముట్లు వినియోగించబడుతున్నాయన్నమాట. అలాగే 1,000 ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు, మెయిన్ ట్రాక్టర్ స్టేషన్లు వున్నాయి. వీటన్నింటిలోను 26 వేల 700 ట్రాక్టర్లు పని చేస్తున్నాయి.

దేశవ్యాపితంగా సాగిన ఈమహోద్యమంలో పాల్గొని, వేలాది కొత్తరకం వ్యవసాయపనిముట్లను కనిపెట్టిన రైతాంగం ఏమంత నిపుణులుకారు. పైగా వారికున్న విద్యకూడా అంతంత మాత్రమే. అయితే వారంతా సామాన్య రైతుజనం. ఆరితేరిన చేతివృత్తులవారు. వీరిలో అధికసంఖ్యాకులకు సరైన విజ్ఞానంగాని, నాగరికతగానిలేదు. అయినప్పటికీ వారందరికీ వ్యవసాయిపనిముట్లలో నూతన విప్లవాన్ని తీసుకు రావాలనే తహతహ. శ్రమశక్తిని తగ్గించుకొంటూ పనిసామర్థ్యాన్ని పెంపొందించుకోవాలనేవాంఛ. వ్యవసాయపు పనులకు తగినంత జనం లేకపోవడమనే సమస్యను పరిష్కరించాలనే ఉత్సాహంవుంది. వారికి సంవత్సరాలకొలది అనుభవంవుంది. వ్యవసాయోత్పత్తిలోవుండే మెళకువులన్నీ వారికంటే తెలిసినవారెవరు? స్వంతంగ ఆలోచించి, ఎన్ని కష్టాలొచ్చినా సరకుచేయక కార్యాన్ని నెరవేర్చుకోవాలనే కమ్యూనిస్టు చైతన్యం వారిలోవుంది. అందుచేతనే ఎన్ని అవాంతరాలొచ్చినా వారికి చిటికెలో అధిగమించే సమర్థత వుంది.

ఉదాహరణకు కొన్ని విషయాల్ని పరిశీలిద్దాం: 1958 జూన్ 15 న "చైనా యంత్ర సంస్థ" 36 మంది "గ్రామీణ నిపుణుల్ని" మరి కొంతమంది సభ్యుల్ని ఆహ్వానించింది. దాదాపు వారంతా రైతు కుటుంబాల నుండి వచ్చినవారే. వీరికి కొద్దిగా చదువొచ్చు: అది కూడ రానివారు కొంత మంది వున్నారు. అయినా డ్రెయినేజ్, ఇరిగేషన్, నాట్లు, సాగు పద్ధతులు మొదలైన విషయాలన్నింటిలోను వీరు కనిపెట్టిన కొత్త పద్ధతులు చైనా వ్యవసాయోత్పత్తిలోనే కనీవినీ ఎరగని మార్పుల్ని తీసుకొచ్చాయి.

## ఇంత స్వల్పకాలంలో ఇంత మార్పు ఎలా సాధ్యమైంది ?

ఇంత స్వల్పకాలం లోచైనా రైతాంగం ఇంత మార్పుని ఎలా సాధించింది? అనే ప్రశ్న ప్రతివారికి స్ఫురిస్తుంది. అది సహజంకూడా. ఇందుకు అనేక కారణాలున్నాయి: చైనాలో నేడు ఉత్పత్తిసాధనాలపై వ్యక్తి యాజమాన్యం రద్దయిపోయింది. దీనితో చైనా రైతాంగానికి కొంత బెడదతప్పింది. ఆ తర్వాత ఇటీవల కాలంలో పాతభావాల్ని

ఛాందసఘోరణుల్ని, మితవాద దృక్పథాన్ని రూపుమాపేందుకై దేశ వ్యాపితంగా "కార్యవిధాన సంస్కరణోద్యమం" కొనసాగింది. దీనితో చైనా రైతాంగం వాస్తవవిషయాన్ని గ్రహించి, శాస్త్రీయ దృక్పథాన్ని అవలంబించుకునే విధంగా తమ పాత భావాల్నికూడ మార్చుకో మొదలు పెట్టారు. తద్వారా వారిలో సోషలిస్టు చైతన్యం వచ్చింది. రెండు: దేశంలో వున్నతమైన సోషలిస్టు వ్యవస్థ అనేది వుంది. ఫలితంగా చైనా ప్రజలందరికీ ఎంతో అండగా నిలబడింది. ప్రతి విజయంలోను వారికి హామీగా వుంటుంది. వీటన్నింటికితోడు చైనా కమ్యూనిస్టుపార్టీ, ప్రజా ప్రభుత్వము యిచ్చే సక్రమ నాయకత్వం ప్రజావిజయాలకు మహా వూపు నిస్తోంది.

ప్రస్తుతం ఈ మహోద్యమం యింకా వ్యాపిస్తోంది. ప్రజల్లో బాగా వేళ్లానుకుంటోంది. ప్రతి రోజూ చైనాలో ఏదో ఒకమూల కొత్త వ్యవసాయ పనిముట్లు తయారవుతూనే వున్నాయి. రైతాంగం వినియోగించే నూతన పరికరాల సంఖ్యకు లెక్కలేదు. కొత్తతరహా వ్యవసాయ పనిముట్లను తయారుచేసే ఉద్యమం చైనా వ్యవసాయ రంగంలో రావలసిన సాంకేతికాభివృద్ధికి పునాదిరాయి మాత్రమేనని గుర్తించాలి. చైనా వ్యవసాయాన్ని ఆధునిక ప్రజా ఉత్పత్తి ప్రాతిపదికమీద అభివృద్ధి చేయడానికి తగిన భౌతిక, సాంకేతిక పరిస్థితుల్ని ఈ కొత్త ఉద్యమం కల్పించిందన్న మాట. చైనా రైతాంగం కనిపెట్టిన కొత్త పనిముట్లుగాని, కొత్తవిగా చేయబడ్డ పాత పనిముట్లుగాని నేడు వ్యవసాయానికి అత్యవసరంగా వున్నాయి. ఇంక కొద్దికాలంలోనే చైనా ప్రజలు పాతపద్ధతులు, పాత పనిముట్లస్థానే, పారిశ్రామిక సంస్థలు ఉత్పత్తిచేసే బ్రహ్మాండమైన యంత్ర సహాయంతోను ఆధునిక విద్యుచ్ఛక్తి పరికరాలతోను వ్యవసాయ రంగంలో మరిన్ని విజయాలు సాధించడానికి దృఢసంకల్పంతో కృషి చేస్తున్నారు. ఇందుకు ఉదాహరణగా పేర్కొనాలంటే, ఒక్కహూనాన్ రాష్ట్రంలోనే 1958 మొదటి అర్ధసంవత్సరంలో ఫ్యాక్టరీలు, గనులు, చేతివృత్తులకు సంబంధించిన వర్కుషాపులు 2 లక్షలకు పైగా నెలకొల్పబడ్డాయంటే ఎవరికైనా ఆశ్చర్యంవేస్తుంది! ఈ పారిశ్రామిక శాఖ

లన్నింటిలోను వ్యవసాయ పనిముట్లే అధికంగా ఉత్పత్తి చేయబడ తాయి. ఆ విధంగా మున్ముందు గ్రామీణ ప్రాంతమంతా పారిశ్రామిక వంతం గావడానికి యివి ప్రథమ సోపానాలన్నమాట.

## పంట భూములు : నీటి నిల్వ సౌకర్యాలు

చైనా మొత్తం ఏరియాలో పర్వత ప్రాంతంగాని, కొండ ప్రాంతంగాని మొత్తం 70 శాతం వుంటుంది. వాతావరణంలోగాని, వర్షపాతంలోగాని ఒక ప్రాంతానికి మరో ప్రాంతానికి చాల తేడాలున్నాయి. "నీటిని నిల్వచేసుకోడమనేది చైనా వ్యవసాయ రంగానికి కీలకమైన సమస్య" అని అధ్యక్షుడు మావో ఒక సందర్భంలో చెప్పారు.

చైనాలో అనేక నదులున్నాయి. నీటి వనర్లు అధికంగావున్నాయి. చిన్నవిగాని మధ్య తరహా నదులుగాని 6 వేలకుపైగా వున్నాయి. వీటి సగటు ప్రవాహ పరిమాణం 2,700,000,000,000 ఘనపు మీటర్లు. ఈ మొత్తం నీటినంతా సద్వినియోగం చేసుకుంటే, 10,000,000,000 'మౌ' లకు పుష్కలంగా నీరు లభిస్తుంది. ఇవేగాక భూగర్భ జలవనర్లు కూడ వున్నాయి. వీటిని కూడా సేద్యానికి వుపయోగించుకోవచ్చు. చైనా విముక్తికి ముందు సేద్యయోగ్యమైన 23 కోట్ల 'మౌ' లలోను 16.3 శాతం మాత్రమే సాగయ్యేది. మిగతా 83.7 శాతం భూమి వర్షాభావం వల్ల, వరదలవల్ల, నీటిని నిల్వచేసే సౌకర్యాలు లేక దెబ్బతినేది. ముంపు భూములైన 40 కోట్ల 'మౌ' లకు మురుగు నీటి పారుదల సౌకర్యాలు లేక దెబ్బతినేది.

1949 లో ప్రజా ప్రభుత్వం ఏర్పడ్డంతో వరద నివారణకు, నీటి నిల్వ సౌకర్యాలు కల్పించడానికి సమూలంకషమైన మార్పుల్ని తీసుకొచ్చింది. జాతీయార్థికరంగం పునర్నిర్మాణం జరిగిన మొదటి మూడు సంవత్సరాలలోను అనేక నీటివనర్లను పునర్నిర్మించడమేకాదు. గతంలో కొమింటాంగ్ దోపిడి ముఠాచే అశ్రద్ధగా వదలబడ్డ జలాశయాలన్నింటిని బాగుచేయడం జరిగింది. పైగా 13 లక్షలకు పైగా చిన్నతరహా కొత్త కాల్వలుగాని, కందకాలు, గుంటలు, డాములుగాని దేశమంతటా

నెలకొల్పారు. 15 లక్షల కొత్త బావులు త్రవ్వారు. 130 భారీ ఇరిగేషన్ ప్రాజెక్టులను, మురుగునీటి పారుదల ప్రాజెక్టులను కట్టారు. ఆ విధంగా ప్రతి కార్యక్రమంలోను ఫ్యూడల్ వ్యవస్థ అవశేషాలు తుడుచిపెట్టుకుపోయాయి. ఇందుకు భిన్నంగా రైతాంగమే తమంత తాముగా విషయాల్ని చక్కబెట్టుకొనే నూతన ప్రజాతంత్ర పరిపాలన నెలకొన్న దన్నమాట.

చైనా ప్రథమ ప్రణాళికాకాలంలో (1953-'58 నీటిని నిల్వచేసే కార్యక్రమం (Water Conservancy) త్వరితగతిని అభివృద్ధి చెందింది. ఈదఫా 21 కోట్ల 'మౌ' లకు పైగా నీటి సౌకర్యం లభించింది. కాబట్టి గతంలో నీటి పారుదల సౌకర్యాలు గల భూమి, ఈ భూమి కలసి మొత్తం 52 కోట్ల 'మౌ' లకు నీటి సౌకర్యాలు కల్పించబడ్డాయి. ప్రతి ఐదు సంవత్సరాలకు వరద తాకిడి తగిలే భూమి 2 కోట్ల 20 'మౌ' లకు పైచిలుకు వుండేది. నేడీ భూమికి వరద బెడద తీరిపోయింది. కారణం చైనా ప్రజల జీవనానికి 'మహమ్మారిగా' తయారైన యాంగ్సీ, "యల్లో" హన్ మొదలైన నదులకు బ్రహ్మాండమైన ఆనకట్టలు కట్టడం ద్వారా వరద ప్రమాదాన్ని తప్పించుకోగలిగారు. ఫలితంగా నీటిని నిల్వచేసుకోవడం ద్వారా అధిక పంటలు పండించుకో గల్గుతున్నారు.

ఇదే సమయంలో భూసార సంరక్షణ (soil conservation) కార్యక్రమంకూడా బాగా అమలు జరిగింది. ప్రథమ ప్రణాళికా కాలంలోనే గ్రామీణ ప్రాంతాల్నికూడా చిన్నతరహా జలవిద్యుత్ (Hydro electric) ప్రాజెక్టులను నెలకొల్పారు. ఇటువంటివి 400 స్టేషన్లు వున్నాయి. ఇవి ఒక్కొక్కటి 10 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేస్తాయి.

ఇన్నిరకాలుగా నీటిపారుదల సౌకర్యాలు కలిగించడంద్వారా, వరద నివారణవల్ల 50 నుండి 100 శాతం వరకు పంటలు అధికంగా పండాయి. కొన్నిచోట్ల నూటికి 200 నుండి 300 శాతం వరకు పండాయి. కొన్ని పొలాల్లో ఒక్క పంట పండడానికే అవకాశాలుండేవి. కాని నేడు రెండు, మూడు పంటలవరకు పండిస్తున్నారు.

1958 నుండి ప్రారంభమైన ద్వితీయ ప్రణాళికాకాలంలో 80, 90 శాతం సాగు భూమికి బాగా నీటిసౌకర్యాలు లభిస్తాయని అంచనా. ఎట్టి ప్రకృతి అవాంతరాలు వచ్చినా అధిక పంట గ్యారంటీ అంటున్నారు. 1957 అక్టోబరు నుండి 1958 జూలై మాసాంతానికి నీటి సాగుభూమి మొత్తం 45 కోట్ల 'మౌ' లు. ఈ మొత్తం చైనా రైతులు గత 4 వేల సంవత్సరాలలో పల్లపు సాగులోకి తెచ్చిన భూమికన్నా రెట్టింపు. 1935 నుండి 1955 వరకు ప్రపంచం మొత్తంమీద సాగులోకి గొనిరాబడ్డ భూమికన్నా పెద్దది.

ప్రస్తుతం చైనా మొత్తంమీద నీటి పారుదల సౌకర్యాలు గల భూమి 97 కోట్ల 'మౌ' లు. అంటే చైనాలో సాగులోకి వచ్చిన మొత్తం భూమిలో పల్లపు సాగు మొత్తం 57 శాతం అన్నమాట. లేదా ప్రపంచం మొత్తంమీద సాగు భూమికన్నా ¼ వ వంతు అధికం. ఈ కాలంలో గ్రామీణ ప్రాంతాల్లో కొత్తగా జలవిద్యుత్ ప్రాజెక్టుల్ని నెలకొల్పారు. ఒక్కొక్కటి 90 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తుంది. నీటిని వృధా పోనీయకుండా నిల్వ చేసుకోవడం ద్వారా ఇంతవరకు 2,100 కౌంటీలలోనూ 610 కౌంటీలలో భూమికి పూర్తి నీటి వనర్లు లభించాయి. దీనిలో ఇకమీదట ఎంత పెద్ద వర్షాలు వచ్చినా వరదల భయం అనేది లేదని. వర్షాభావం వున్నా అధిక పంటలు సాధ్యమనీ చైనా రైతుల అనుభవం.





పైరులకు తెగుళ్ళు తగిలినప్పుడు ఆ పురుగులను ఆకర్షించడానికి పొలాల్లో శక్తివంతమైన విద్యుద్దీపాలను ఉపయోగిస్తున్న దృశ్యం.

2 వ ప్రకరణ

# ప్రజా కమ్యూన్ల ద్వారా బహుముఖాభివృద్ధి

నవచైనాలో వివిధ రాష్ట్రాల్లో మ...ధృతంగా సాగుతున్న ప్రజా కమ్యూన్ల స్థాపనోద్యమానికి ముందు దేశమంతటా 7 లక్షల 50 వేల సహకార వ్యవసాయ సంఘా లుండేవి.

చిన్న తరహా సహకార వ్యవసాయక్షేత్రాలు నానాటికి పెంపొందు తున్న తమ అవసరాల్ని తీర్చలేకపోవడంవల్ల, వ్యవసాయం, భారీ ఎత్తున పెట్టుబడి నిర్మాణం, ఒకే భూమిలో అనేక రకాల పంటలు పండించడం మున్నగు విషయాల్లో సాధించిన బ్రహ్మాండమైన అభివృద్ధి; పారిశ్రామిక, వ్యావసాయక, తదితర ఆర్థిక రంగాల్లో బహుముఖాభివృద్ధిని గొనిరావడంలోను, దేశమంతటా 'కార్యవిధాన సంస్కరణోద్యమం' విజయవంతంగా నిర్వర్తించడంలోను చైనా రైతాంగం ఎంతో ఉత్సాహంతో పాల్గొన్నారు. ఫలితంగానే ఇన్ని రకాల అభివృద్ధిని సాధించ డానికి ప్రజా కమ్యూన్లు ఏర్పడ్డాయి. దేశమంతటా మొత్తం 25 వేలనుండి 26 వేల ప్రజాకమ్యూన్లు ఏర్పడనున్నాయి. ప్రస్తుతం చైనా అంతట 23 వేల 384 కమ్యూన్లు ఏర్పడ్డాయి. ఒక్కొక్క కమ్యూన్‌లో సగటున 4,797 రైతు కుటుంబాలు సభ్యులుగా చేరారు. తాలూకా వ్యాపితంగా మొత్తం 94 కమ్యూన్లుగాని లేదా కమ్యూన్ల సమాఖ్యలుగాని ఏర్పడ్డాయి. ఇవి 13 రాష్ట్రాల్లో సేకరించిన లెక్కల్నిబట్టి తేలినవి.

ప్రజా - కమ్యూన్లు స్థాపించకపూర్వమే చిన్నతరహా కమ్యూన్లు అనేకచోట్ల వెలిశాయి. ఈ చిన్నతరహా కమ్యూన్లలో గడించిన అనుభవాలు ప్రజా కమ్యూన్ల స్థాపనకు మరింత దోహదంచేశాయి. మొదటిసారిగా "సూపింగ్" ప్రాంతంలో "స్పుత్నిక్" ప్రజాకమ్యూన్ జయప్రదంగా స్థాపించబడింది. ఆతర్వాత ఈ కమ్యూన్ల ఉద్యమం అభివృద్ధి చెందింది. ప్రజాకమ్యూన్లగురించి చర్యలు చైనా అంతటా—ముఖ్యంగా గ్రామసీమల్లో ఉధృతంగా సాగుతున్నాయి. అనేకప్రాంతాలనుండి ప్రజలు తమ ప్రతినిధివర్గాలను కౌంటీ కమ్యూనిస్టుపార్టీ ఆఫీసులకు పంపుతున్నారు. నేటికి 90 శాతం చైనా రైతాంగ కుటుంబాలు వీటిల్లో చేరాయి.

బహుముఖ ప్రయోజనకారియైన ఈ ప్రజా కమ్యూన్ల ప్రత్యేక లక్షణాల్ని గూర్చి తెలుసుకోవడం అవసరం:

(1) ఈ కమ్యూన్లు వ్యవసాయ, అటవీ శాఖ, పశువుల పెంపకం, చేపల పరిశ్రమ మొదలైనవాటి అభివృద్ధికి తోడ్పడతాయి. పారిశ్రామిక, వ్యావసాయక, వాణిజ్య, విద్యా, సైనికవిషయా లన్నిటి యాజమాన్యాన్ని సమన్వయం చేయడానికి ఈ కమ్యూన్లు ఎంతగానో తోడ్పడతాయి. నవచైనాలో ప్రస్తుత సోషలిస్టు సమాజానికి, సోషలిజంనుండి కమ్యూనిస్టు సమాజ పరిణామదశకు ప్రజా కమ్యూన్లు ప్రాథమిక వ్యవస్థలుగా వుంటాయి. (2) పోనుపోను ఈ కమ్యూన్ల పరిమితి విస్తరిస్తూంటుంది. ప్రతి కమ్యూన్‌కి రాజకీయార్థిక సాంస్కృతిక కేంద్రంగా ఒక పట్టణం వుంటుంది. (3) రాజకీయార్థిక వ్యవస్థలు రెండూ కలసి ఒక్కొక్క కమ్యూన్‌లో అంతర్భాగంగా వుంటాయి. (4) పరిమితిగావున్న సమిష్టి యాజమాన్యంనుండి ఉత్పత్తి సాధనాలు క్రమేణా మొత్తం యావన్మంది ప్రజల యాజమాన్యం క్రిందకు వస్తాయి. ఫలితంగా వ్యక్తిగత యాజమాన్యానికి చెందిన అవశేషా లేవైనా వుంటే అవి యింతటితో సమూలంగా నిర్మూలించబడతాయి. (5) ప్రజా కమ్యూన్ల సభ్యత్వం అధికాధికంగా వుండడంవల్ల, కమ్యూన్లు వివిధ సమస్యలపై కేంద్రీకరించి పని చేస్తాయి. ఫలితంగా స్థిరమైన పద్ధతిలో శ్రమశక్తి విభజనకు దారితీస్తుంది. కమ్యూన్ల సభ్యుల కిచ్చే శిక్షణ ఉక్కు శిక్షణ. ఉత్పత్తిలో

కాని, దైనందిన జీవితంలోగాని ఎంతో క్రమశిక్షణ ః కమ్యూన్ సభ్యుల నిపుణత్వం, వారి ఉత్పత్తి శక్తి, వారి అనుభవం - ఒకదానికొకటి చక్కగా సమన్వయింపబడ్డాయి. (6) గృహనిర్మాణ కార్యకలాపాలు కూడా చాలవరకు సమాజపరం కావడంతో సమిష్టి జీవనం ఏర్పడింది. (7) కమ్యూన్ల సభ్యులకు వేతన విధానాన్ని అనుసరించే వేతనాలు ముట్టుతూ వుంటాయి. కొన్ని కమ్యూన్లలో జీతాలు డబ్బు రూపేణా కాకుండా ఏ ధాన్యం రూపంలోనో ముట్టుతూ వుంటాయి. (8) సభ్యులు సంపూర్ణ సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధిపరచేందుకు, తమ రాజకీయ చైతన్యాన్ని బాగా పెంపొందించుకునేటట్లుగా ప్రజా కమ్యూన్లు శతధా తోడ్పడతాయి.

## వ్యవసాయ సహకార సంఘాలపై ఆధిక్యత

ప్రజా కమ్యూన్లు ఏర్పడ్డంతో ఉత్పత్తిశక్తులు, మరింత విముక్తి పొందాయి. వ్యవసాయ సహకార సంఘాలపై కమ్యూన్ల ఆధిక్యత ఎలాంటిదో ఈ క్రింది విషయాల్ని పరిశీలిస్తే బోధపడుతుంది:

1. కమ్యూన్లలో పనిచేసే రైతాంగప్రజల పని - సామర్థ్యత వ్యవసాయ సహకార సంఘాల్లో పనిచేసేవారి సామర్థ్యంకన్నా 20 శాతం ఎక్కువ. కమ్యూన్లలోని స్త్రీ సభ్యుల ఉత్పత్తి శక్తికూడా పెరిగింది. 7 పరిపాలనా ప్రాంతాల్లో (ఎడ్మినిస్ట్రేటివ్ రీజియన్స్) చేసిన ప్రాథమిక సర్వేనిబట్టి తేలిందేమంటే- ఆ ప్రాంతాల్లో ప్రజా సౌకర్యార్థం ఏర్పాటు చేయబడ్డ రెస్టారెంట్ల (కాఫీ. భోజనశాలలు) నిర్మాణ కార్యక్రమంలో, 60 లక్షల 90 వేల మంది స్త్రీలు పాల్గొన్నారు.

2. ప్రజాకమ్యూన్ల నిర్మాణంతో ప్రజల నుండి పోగుచేసిన డబ్బు మొత్తంతో అవసరమైన కార్యాలు కొంతవరకు నెరవేరాయి. ఈడబ్బును ఎంతో పొదుపుగా వాడారు. ఫలితంగా పరిశ్రమలకు, వ్యవసాయానికి వ్యయసాయ యంత్ర సామగ్రికి ఈ డబ్బంతా పెట్టుబడిగా వినియోగ పడింది.

3. వ్యవసాయ సహకార సంఘాల్లోమాదిరి కాకుండా కమ్యూన్ల లోని రైతాంగం— భూసారాన్నిబట్టి. ఎంతవరకు ఉత్పత్తి చేయడానికి వీలుంటుందో అంతవరకు ఉత్పత్తి చేయడానికి తన భూమిని ఉపయో గించుకోవచ్చు. వ్యవసాయ సహకార సంఘాల్లో యిందుకు కొన్ని అడ్డంకు లున్నాయి.

4. కమ్యూన్లలోని రైతాంగం శ్రమశక్తినిగాని, పెట్టుబడి, భూమి, తదితర వనర్లను— వీటన్నింటిని చక్కగా సమన్వయంచేసి వినియోగించుకోడానికి, ఫలితంగా ప్రకృతి వైపరీత్యాలను ఎదుర్కో డానికి పెద్ద పెట్టున నిర్మాణకార్యక్రమాన్ని కొనసాగించడానికి కమ్యూన్లు అవకాశాలు కలుగజేశాయి.

5. అంతేకాదు, సాంకేతిక, సాంస్కృతిక రంగాలలో బ్రహ్మాండ మైన విజయాన్ని సాధించడానికి, సంస్కృతిని, విద్యను బాగా అభి వృద్ధిపరచడానికి ప్రజా కమ్యూన్లు అవకాశాల్ని కల్పిస్తాయి. ఉత్పత్తి శక్తితో విద్యావిధానాన్ని జోడించడం ద్వారా కమ్యూన్లు క్రమేణా సార్వజనీన విద్యాభివృద్ధికి తోడ్పడతాయి. మీదుమిక్కిలి కమ్యూన్ల సభ్యులందరికి ఉచిత వైద్యసౌకర్యాలు లభిస్తాయి.

ఉదాహరణకు ప్రజా కమ్యూన్లు అప్పుడే హూనాన్ రాష్ట్రంలో వ్యవసాయ కళాశాలలను, మాధ్యమిక పాఠశాలలను నెలకొల్పాయి. ప్రాథమిక పరిశీలననుబట్టి తేలిందేమంటే - ఈ రాష్ట్రంలో 98 వేల కళా శాలలు నెలకొల్పబడ్డాయి. వీటిలో 20 లక్షల 40 వేల మంది కార్య కర్తలు, రైతులు విద్య నభ్యసిస్తున్నారు. ఈ రాష్ట్రంలో అప్పుడే సార్వ జనీన సెకండరీ. ప్రాథమికవిద్య ప్రవేశపెట్టబడ్డాయి.

6. సోషలిస్టు సమాజ నిర్మాణ సాధారణ కార్యక్రమాన్ని నిర్వర్తించాలంటే ప్రజా కమ్యూన్లు అందుకు తగిన సాధనాలుగా వున్నాయి. అలాగే ఒకే తఫాగా పారిశ్రామిక, వ్యవసాయ రంగాల అభివృద్ధిని కొనసాగించాలన్నా. ఒకేతఫా పెద్ద మధ్యతరహా, చిన్న తరహా ప్రాజెక్టులను నెలకొల్పాలన్నా ఆధునిక పద్ధతుల ద్వారా ఒకేతఫా

లఘుపరిశ్రమలు. భారీ పరిశ్రమాభివృద్ధి జరగాలన్నా ఈ ప్రజా కమ్యూన్లు చక్కగా తోడ్పడతాయి.

రాష్ట్రంలో ఇప్పటికి పనిచేస్తున్న ప్రజా కమ్యూన్లద్వారా నెలకొల్ప బడ్డ ఫ్యాక్టరీలుగాని. వర్కుషాపులుగాని దాదాపు 3 లక్షల 50 వేల వరకు వున్నాయి. ఇలాగే అనేక రంగాలలోకూడా.

7. ప్రజాకమ్యూన్లలో కమ్యూనిస్టు భావాలు రోజురోజుకి వ్యాప్తి చెందుతూ వున్నాయి. ఫలితంగా ఈ భావాలు పట్టణాలకు. గ్రామసీమలకు మధ్యనున్న భేదాల్ని. పరిశ్రమలు వ్యవసాయ రంగానికి మధ్యనున్న భేద భావాల్ని. మానసిక శ్రమకు. శారీరక శ్రమకు మధ్యనున్న భేదభావాల్ని తొలగించి వేయడానికి ఎంతగానో తోడ్పడతాయి.

8. బూజుపట్టిన పాతభావాల్ని. బూర్జువా పోకడలను వదిలించు కోవడానికి ప్రజాసోషలిస్టు కమ్యూనిస్టు చైతన్యాన్ని ఉద్దీపింపజేయటానికి కమ్యూనిస్టు నీతిసూత్రాలను అలవర్చడానికి ఈ ప్రజాకమ్యూన్లు ఎంత గానో సహాయపడతాయి.

ప్రజాకమ్యూన్లు నెలకొల్పే ఉద్యమంలో, హోనాన్ రాష్ట్రంలోని అన్ని స్థాయిలలో వున్న స్థానిక శాఖలన్నీ పేద, మధ్యతరగతి రైతాం గంపైన. మొత్తం రైతాంగ ప్రజలసాయంపైనే ఆధారపడ్డారు. ఫలి తంగా ప్రజాకమ్యూన్ల ఉద్యమం మూడుపూవులూ ఆరుకాయలుగా పరిఢవిల్లుతూంది. ఈ సందర్భంలో కమ్యూన్ల బాగోగులనుగూర్చి అభి ప్రాయాలు తెలుపవలసిందిగా రైతాంగ ప్రజలకు ఉత్సాహ ప్రోత్సాహాలు యివ్వబడ్డాయి. ఉద్యమం ప్రారంభం కానడంతోనే రైతులంతా దీన్ని గూర్చి పెద్దయెత్తున చర్చలు మొదట సాగించారు. చర్చాంశాలలో కొన్ని ప్రశ్నలు: ప్రజాకమ్యూన్లు అనేవి నెలకొల్పాలా, అవసరంలేదా? అటు వంటి అవసరం వుంటే వాటిల్లో వున్న మంచి ఏమిటి? వాటిని ఎలా నెలకొల్పాలి? అనే ప్రశ్నలు తలెత్తాయి. ఈ ప్రశ్నపరంపర రైతాంగ ప్రజలు చైతన్యవంతులు గావడానికి తోడ్పడింది. అంతులేని ఉత్సాహం వారిలో పొంగులువారుతోంది. చర్చల అనంతరం, ప్రజాకమ్యూన్లను స్థాపించుకోవడానికి అనుమతించవలసిందిగా రైతులు అనేక దరఖా స్తులు పెట్టుకున్నారు.

# లోతుదుక్కి ఎలా సాధ్యమైంది ?

లోతు దుక్కి, ఆకురాలు కాలపు నూర్పిళ్ళు, విత్తనాలు జల్లడం - ఇవి నేడు చైనా గ్రామసీమల్లో వ్యవసాయాభివృద్ధికి సంబంధించిన ప్రధానాంశాలుగా వున్నాయి.

వ్యవసాయోత్పత్తిని మరింత ఎక్కువచేయాలంటే 'లోతుదుక్కి' అనేది అత్యంత ప్రధానమైన సాంకేతిక అభివృద్ధిగ భావించాలని ఆగస్టులో చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ రైతాంగ ప్రజలందరికీ విజ్ఞప్తి చేసింది. దేశమంతటా ఈ పద్ధతిని అనుసరించాలని విజ్ఞప్తి చేసింది. వచ్చే రెండు మూడు సంవత్సరాలలోనే దేశమంతటా ఈ నూతన పద్ధతి అమల్లోకి వచ్చేస్తుంది.

హోపే, షాంటుంగ్. హోనాన్, షాన్సీ, షెన్సీ, కూపే, అకలీ, కియాంగ్సూ, సూవాన్, చింగాయ్, నింగ్సే మొదలైన అనేక ప్రాంతాల్లో లోతుగ దున్నడం అనేది ఒక మహోద్యమంగా వుంది. ఈ కార్యక్రమంలో కోట్లాది ప్రజలు పాల్గొంటున్నారు. గత అనుభవాన్నిబట్టి చూస్తే, లోతుదుక్కివల్ల సాధారణంగా వ్యవసాయోత్పత్తిని 50 శాతం నుండి 5 రెట్లు అధికంగా చేయెచ్చు.

అందులోను నేడు దేశమంతటా ప్రజా కమ్యూన్లు నూతనంగా ఏర్పడ్డాయి. వీటికి చాల సమర్ధవంతమైన అంగబలం వుంది. ఈ కమ్యూన్లు తమ సభ్యుల్ని గ్రూపులుగా విడగొట్టుతుంది. ఒక గ్రూపు దుక్కిలోను, నూర్పిళ్ళు. విత్తనాలు విత్తడంలోను నిమగ్నమైయుంటే, మరో గ్రూపువారు ఇనుమూ. ఉక్కు ఉత్పత్తి చేయడంలో పాల్గొంటున్నారు. అంతేగాకుండా అంగబలం ఎక్కువగావున్న ప్రాంతాల నుండి తక్కువగావున్న ప్రాంతాలకి కొంతమంది వాలంటీర్లను అక్కడి పనిపాట్లలోకి పంపిస్తున్నారు.

అనేక ఉత్పత్తి దళాల్లోని సభ్యులు పొలాల్లో పనిచేస్తున్నారు. అక్కడే తిండి, నిద్రాకూడా. ఇంతకష్టం ఎందుకు పడుతున్నారు ? 'కష్టేఫలే' అన్నారుమరి. వచ్చే సంవత్సరం వేసవి పంటనాటికి ఈ




గాతములుత్రవ్వే ఒక పనిముట్టు. (ఇది అసలు యంత్రములో ఒక భాగం మాత్రమే)




పళ్ళెపు నాగలి.




లోతుదుక్కికి వినియోగించే రెండు కర్రుల నాగలి.




తేలియాడే వరినాట్లకు ఒక పనిముట్టు.




అనేక పనులకు ఉపయోగపడే 'సాగు' యంత్రం.

Seed box = విత్తనాలుపోసే డబ్బా

Pesticide Duster = తెగుళ్ళ మందుల్ని జల్లేపనిముట్టు

Packer = పాకర్.

Seeding tube = విత్తనాలు క్రిందపడవేసే గొట్టం

Hoe = గుంటుక, లేక, పార




గడ్డను పొడి చేసే యంత్రం.




మర 'మోట'

సంవత్సరంకన్న ఎక్కువ ఉత్పత్తి చేయాలనే! గుడారాలు, టీ స్టాలులు, ఆఫీసులు, చిన్నచిన్న స్టోర్ రూములు, చికిత్సకేంద్రాలు, సాంస్కృతిక కేంద్రాలు, సంచార గ్రంథాలయాలు - ఇవన్నీ తాము పనిచేసే పొలాలకు సమీపంలోనే నెలకొల్పు కుంటున్నారు. ఆ విధంగా ఈ ప్రాంతాలన్నింటినీ చిన్నచిన్న పట్టణ ప్రాంతాలుగా మారుస్తున్నారన్నమాట! ఖాళీసమయాల్లో రైతాంగం ప్రత్యేక తరగతుల్లో విద్య నభ్యసిస్తారు. లేదా వ్యవసాయ రంగంలో వస్తున్న శాస్త్రీయ, సాంకేతిక మెఱుకువుల్ని గూర్చి సోదర రైతులతో చర్చించడమో చేస్తుంటారు. పాటలు, ఆటలు, వివిధ ప్రాంతాల్లో లోతు దుక్కులు గూర్చిన ఫలితాలు, తదితర వ్యావసాయిక విషయాల్ని గూర్చి తెలుసుకొనేందుకు ఆయా ప్రాంతాల్లో పనిచేస్తున్న రైతాంగానికందరికీ అందుబాటులో స్థానికంగా రేడియో అవకాశాలున్నాయి.

లోతుదుక్కి ఉద్యమంలో స్థానిక కమ్యూనిస్టు పార్టీ శాఖలన్నీ ప్రజలకు ప్రత్యక్ష నాయకత్వం వహిస్తున్నాయి. నూతన పద్ధతుల్లో ఏ విధంగా ఈ కార్యక్రమాన్ని నెరవేర్చాలో రైతాంగానికి బోధిస్తున్నాయి. ఇటీవల తేలిన లెక్కల్నిబట్టి గోధుమపంట 8 ప్రధాన రాష్ట్రాల్లో ఒక కోటి 16 లక్షల హెక్టర్లలో లోతుదుక్కి పద్ధతిని అమలు జరిపారు.

## ఎంతలోతు తవ్వుతున్నారు?
## దీనికి వినియోగించే సాధనా లేమిటి?

చైనాలో మామూలుగా దాదాపు 1 అడుగు అంటే 12 అంగుళాల లోతువరకు దున్నుతున్నారు. కాని అధిక పంటలు పండే కొన్ని ప్రాంతాల్లో మాత్రం రెండునుండి 10 అడుగుల లోతువరకు కూడ దున్నుతున్నారు. కాని వెనుకట్నుంచి అనుసరిస్తున్న పద్ధతుల ప్రకారమైతే అనేక ప్రాంతాల్లో 5 అంగుళాలకంటే ఎక్కువ లోతు దున్నేవారు కారు.

లోతుదుక్కి దున్నడంవల్ల అనేక లాభాలున్నాయి: భూమి

---

బాగా కండబలుస్తుంది. (Soil texture); నీటిని ఎక్కువగ పీల్చుకో డానికి అవకాశముంటుంది. అలాగే ఎరువుల్ని ఎక్కువగ నిల్వచేసుకో

గల్గుతుంది. వర్షాభావంవల్ల రైతుకి గుండె దుడుకు వుండదు. పంట మొక్కలు భూమి లోపలికి బాగా వేళ్ళూనుకొనేలా చేస్తుంది. ఫలితంగా వత్తుగా మొక్కల్ని నాటడానికి అవకాశ ముటుంది.

కొత్తతరహా వ్యవసాయ పనిముట్లు వుపయోగంలోకి వస్తున్నాయి. వున్నవాటిని బాగుచేసి వుపయోగంలోకి తెచ్చుకుంటున్నారు. ఒక్క "హీలుంగ్ కియాంగ్" రాష్ట్రంలోనే - ప్రజా కమ్యూన్లు 120 కొత్తతరహా నాగళ్ళను కనిపెట్టాయి. గతంలో వినియోగించినవాటి కన్నా ఈ నాగళ్ళు భూమిలోకి బాగా తొలుచుకుపోయి లోతుదుక్కికి అనుకూల పడ్తాయి. ఇవిగాక ఆకురాలు కాలం కోతలనాటికి 350 రకాల నూర్పిడి పనిముట్లు, వడ్లు దంచే పరికరాలు తయారుచేశారు.

అన్నింటికంటే అందుబాటులో వున్నదీ, అందరూ మెచ్చుకున్న లోతుదుక్కికి పనికివచ్చే యంత్రాన్ని ఒకటి కనిపెట్టారు. దీని పేరు "టూయింగ్ కేబిల్ మెషీన్" అంటారు. దీన్ని తయారుచేసినవారు కియాంగ్సూ రాష్ట్రంలోని రైతులు. ఈ యంత్రానికి కొన్ని చక్రాలుంటాయి. ఈ చక్రాలకు ఒకవిధమైన వంపాటి యిరుసులు వుంటాయి. అలాగే బండపాటి మోకులు వుంటాయి. నాగళ్ళకు వీటిని అమర్చుతారు. అప్పు డీ యంత్రం చాలువెంటే లాక్కువెళ్తూవుంటుంది. ఈ యంత్రం చాల సుళువుగా వుంటుంది. దీన్ని తయారుచేయడంగాని, నడపడంగాని చాల తేలిక. ఈ యంత్రం నమూనాలోనే అనేక రకాల పనిముట్లను తయారుచేశారు. ఈ యంత్రాలు మానవశక్తికంటే అనేక వేల రెట్లు ఎక్కువ. ఈ యంత్రాన్ని వుపయోగించి లోతుదుక్కి సాగిస్తున్న ప్రప్రథమ రాష్ట్రం కియాంగ్సూ రాష్ట్రమేనని చైనా ప్రభుత్వం ప్రకటించింది. ఇటువంటి యంత్రాలు రాష్ట్రమంతటా దాదాపు 6 లక్షలు తయారు చేశారు. ఇప్పుడీ యంత్రాన్ని - "టూయింగ్ కేబిల్ మెషీన్"- దేశమంతటా ఉపయోగంలోకి తేనున్నారు. కొద్ది వారాల్లోనే దేశంలో వున్న ప్రజాకమ్యూన్లు అన్నింటికీ ఈ యంత్రాలను సప్లయిచేయాలని యత్నిస్తున్నారు.



3 వ ప్రకరణం

# పారిశ్రామికాభివృద్ధి

చైనా ద్వితీయ ప్రణాళికలో ఇది (1958) మొదటి సంవత్సరం. ఈ ఏడు పరిశ్రమలలోను, రవాణా సౌకర్యాల విషయంలోను మహత్తర మైన అభివృద్ధి జరుగుతుంది.

ఈ ఏడు 107 లక్షల టన్నుల ఉక్కు, 21 కోట్ల టన్నుల బొగ్గు. 2,750 కోట్ల కిలోవాట్ల గంటల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయ సంకల్పిం చారు. ఈ ఒక్క సంవత్సరంలోనే ఉత్పత్తి విషయంలో ఇంత అభి వృద్ధిని సాధించడానికి బ్రిటన్‌కు ఉక్కు ఉత్పత్తిలో 31 ఏళ్ళు, బొగ్గు ఉత్పత్తిలో 75 ఏళ్ళు, విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో 4 ఏళ్ళు పట్టింది.

గతసంవత్సరం చైనాలో 53½ లక్షల టన్నుల ఉక్కు 13 కోట్ల టన్నుల బొగ్గు, 1930 కోట్ల కిలోవాట్ గంటల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయబడింది.

ఈ సంవత్సరం ఆగస్టు నెలాఖరుకు జరిగిన పారిశ్రామిక ఉత్పత్తి అంతకుక్రితం సంవత్సరం ఇదేకాలంలో జరిగిన అభివృద్ధికంటే విలు వలో 47 శాతం పెరిగింది. ఈ సంవత్సరం పారిశ్రామిక ఉత్పత్తి విలు వలో నెల నెలకు అభివృద్ధి కానవస్తోంది. గతసంవత్సరం జనవరి-ఆగస్టు నెలలమధ్య జరిగిన అభివృద్ధితో పోల్చితే ఈసంవత్సరం జరిగిన అభి వృద్ధి యిలా వుంది : జనవరి 14 శాతం, ఫిబ్రవరి 18 శాతం, మార్చి

29 శాతం. ఏప్రిల్ 42 శాతం, మే 46 శాతం, జూన్ 55 శాతం, జూలై 74 శాతం, ఆగస్టు 101 శాతం.

నిరుడు మొదటి 7 నెలలతోను పోల్చిచూస్తే ఉక్కు ఉత్పత్తి ఈ ఏడాది ఆగస్టు నెలాఖరుకు 31 శాతం పెరిగింది. ఇదేకాలంలో ముడి ఇనుము, విద్యుచ్ఛక్తి, బొగ్గుఉత్పత్తి 37 శాతంనుండి 52 శాతం వరకు పెరిగింది.

ఈ సంవత్సరంలో యంత్రపరికరాలు 80.000 లేక, నిరుటికంటే రెండురెట్లు ఉత్పత్తి చేయబడతాయి. ఇప్పుడు యంత్రనిర్మాణ పరిశ్రమ చైనా జాతీయార్థిక అవసరాలను తీర్చగల్గుతోంది.

ఈ సంవత్సరం 220 లక్షల కిలోవాట్ల శక్తిగల స్టీమ్‌పవర్ స్టేషన్ల నిర్మాణం ప్రారంభమవుతుంది. ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో జరిగిన కృషికి ఇది అయిదురెట్లు. ఈ సంవత్సరం 12 కోట్ల టన్నుల దిగుబడి కాగల కొత్తబొగ్గుగనులలో పని ప్రారంభించ బడుతుంది. క్రూడ్ ఆయిల్ ఉత్పత్తి నిరుటికంటె 50 శాతం పెరుగుతుంది. ఈ సంవత్సరం 1 కోటి టన్నుల సిమెంట్ ఉత్పత్తి చేయబడుతుంది. నిరుటికంటె ఇది 47 శాతం ఎక్కువ. ఇదికాక కొన్నిలక్షల టన్నుల తక్కువరకం సిమెంట్ కూడా ఉత్పత్తి అవుతుంది.

నూలు బట్టల ఉత్పత్తి నిరుటికంటె 26 శాతం పెరుగుతుంది.

ఈ సంవత్సరం రైల్వే పరికరాల ఉత్పత్తి కార్మాగారాలలో శక్తివంతమైన ఇంజన్లు తయారుచేయడం ప్రారంభించారు. ఇదీ స్థూలంగా చైనా పారిశ్రామికాభివృద్ధి.

## మిరుమిట్లు గొలిపే సాంకేతికాభివృద్ధి

ఉత్పత్తి అభివృద్ధి చేయడంలోనేకాకుండా సాంకేతికంగా కూడ చైనా ప్రజలు బ్రహ్మాండమైన విజయాల్ని సాధిస్తున్నారు. ప్రజల సాంకేతిక పరిజ్ఞానం (Technology) పెరుగుతున్నకొలదీ రోజురోజుకీ నూతన పారిశ్రామిక పద్ధతులు కనిపెట్టబడుతున్నాయి. ఉదాహరణకు గత అర్ధసంవత్సరంలో జరిపిన కొన్నింటిని పరిశీలిద్దాం: లోహ పారి

శ్రామిక రంగంలో తైయువాన్ ఐరన్ అండ్ స్టీల్ వర్క్సు కార్మికులు ఉక్కు ఉత్పత్తికి సంబంధించిన ఒక కొత్త పద్ధతిని కనిపెట్టారు. ఈ నూతన పద్ధతి దేశమంతా విజయవంతంగా అమలు జరుపబడుతూంది.

కొన్ని అతిముఖ్యమైన సాంకేతిక రంగాలలో నవచైనా ఎంతో అభివృద్ధిగాంచిన దేశాలకంటే కూడా లక్ష్యాలలోనే గాక వాటి సాధనలో కూడా ముందంజ వేస్తోంది. ఉదాహరణకు పింగాణీ పరిశ్రమ చూడండి (Ceramic industry). యంత్రపరికరాల్ని తయారుచేయడానికి యీ పింగాణీని వాడుతున్నారు. ఈ పద్ధతిలో చైనావారు విజయం సాధించారు. ఇది అత్యంత ప్రాముఖ్యతగల సాంకేతిక విప్లవం అంటున్నారు. చైనాలోని పింగాణి పరిశ్రమలో యింతవరకు పారిశ్రామిక వస్తువులకు సంబంధించిన వేలాది రకాల్ని తయారుచేశారు. (ఉ॥ రసాయనిక, లోహ, విద్యుదుత్పత్తి, భవన నిర్మాణానికి, గ్లాస్ తయారీకి సంబంధించిన "సెంట్రిఫ్యూగల్" పంపులను తయారుచేసింది.)

బొగ్గు గనులకు సంబంధించిన మరో గొప్ప సాంకేతిక విజయం: ప్రపంచంలోనే అత్యంత ఆధునిక సాంకేతిక పద్ధతి - హైడ్రాలిక్ కోల్ మైనింగ్ పద్ధతి ని కనిపెట్టారు. ఈ పద్ధతిని కైలాన్, చీవాంగ్ బొగ్గు గనుల్లో వుపయోగించగా బ్రహ్మాండమైన ఫలితాలు లభించాయి.

మొత్తం 16 రాష్ట్రాల్లోను, ప్రధాన పారిశ్రామిక నగరాల్లోను కలిపి యింతవరకు 27 వేల కొత్త పారిశ్రామిక వస్తువుల్ని తయారు చేశారు. వీటిల్లో అధికభాగం తగిన సాధనసంపత్తి అవకాశాలు లేక పోయినా ఉత్పత్తి చేయబడ్డాయి. పైగా అంతర్జాతీయంగా ఈ వస్తువుల విలువ కూడా బాగా పెరిగింది. అలాగే యంత్ర పరిశ్రమల్ని తీసుకోండి. కావలసిన సాధన సామాగ్రి కొరవడ్డా చైనా అంతటా అనేక చిన్నచిన్న ఫ్యాక్టరీలు ఏర్పడ్డాయి. అనేకమైన చిన్నతరహా ట్రాక్టర్లు, చిన్నవైనా అనేక పనులకు వుపకరించే మోటార్ ట్రక్కులను (ప్రధానంగా స్థానిక పరిస్థితులకు, అవసరాలకు సరిపోయేవి) ఉత్పత్తి చేశారు.

# పెట్టుబడి నిర్మాణం

1958 మొదటి అర్ధ సంవత్సరంలోను పెట్టుబడి సేకరణలో కూడా చాల విజయాలు సాధించబడ్డాయి. పెట్టుబడి నిర్మాణ రంగంలో మొత్తం పెట్టుబడి గత సంవత్సరం పూర్వార్ధంకన్నా 88.1 శాతం ఎక్కువ. దేశం మొత్తంమీద భారీ, మధ్యతరహా పారిశ్రామిక, మైనింగ్ సంస్థలు 62 ఏర్పడ్డాయి. ఇవి పని ప్రారంభిచాయికూడ.

చైనా ఉత్తర ప్రాంతంలోని టీన్‌షాన్ పర్వత ప్రాంతంనుండి యిటు చైనా దక్షిణ దిశవరకు ఎక్కడికక్కడ నిర్మాణ కార్యక్రమం పురకలు పెట్టుకుంటూ సాగిపోతోంది. "ప్రతి దమ్మిడీ జాగ్రత్తగా వాడాలి. నిర్మాణాభివృద్ధి రెండింతలవాలి" అన్న నినాదంవల్ల నిర్మాణ ఖర్చులు చాల తక్కువ అవుతున్నాయి. ప్రస్తుతం లోహ పరిశ్రమల మంత్రిత్వ శాఖ ఆధ్వర్యాన నిర్మితమవుతున్న ఆన్షాన్, పావోటో, వూహాన్, తైయువాన్, యూనాన్‌టిన్ కంపెనీలు మొదట అనుకున్న దానికంటే సగం ఖర్చు తక్కువతో నిర్మించబడతాయి. అయితే అనుకున్న ఉత్పత్తి ఏమాత్రం తగ్గదని గుర్తుంచుకోవాలి.

ప్రజల చొరవతో దేశమంతటా స్థానికంగా అనేక పరిశ్రమలు నెలకొంటున్నాయి. 1958 సంవత్సరం మొదటి అర్ధభాగంలోనే రాష్ట్రాల, ప్రత్యేకజిల్లాల, కౌంటీలలోను, పట్టణాలలోను నెలకొల్పబడ్డ పారిశ్రామిక సంస్థల సంఖ్య 3 లక్షలు. వీటిలో 90 వేల పారిశ్రామిక సంస్థలు కేవలం రాష్ట్రాలు, జిల్లాలు, కౌంటీలు నెలకొల్పుకున్నవే. ఇక పోతే పట్టణాలు నెలకొల్పుకున్న పారిశ్రామిక సంస్థల సంఖ్య 2 లక్షల 10 వేలు. అయితే ఇవిగాక సహకార వ్యవసాయ సంఘాలు ఏర్పరచిన లఘు పారిశ్రామిక సంస్థలు మరో 30 లక్షలు వున్నాయన్న సంగతి గుర్తుంచుకోవాలి. వీటిలో చాలాభాగం ముడి ఖనిజాలు, ఇంధనం, విద్యుచ్ఛక్తి పరిశ్రమలకు సంబంధించినవి. వీటిని ప్రజలు కేవలం సాంప్రదాయకంగా వస్తున్న పద్ధతులవల్లనే నెలకొల్పుకోగల్గారు. ఇప్పటికి అంచనా వేసిన దాన్నిబట్టి 11 వేల ఇనుము కరగించే ఫర్నస్‌లు, 20 వేల లఘు విద్యుత్

కార్మాగారాలు. 10 వేల చిన్న తరహా సిమెంటు బట్టీలు; 8 వేల చిన్న తరహా బొగ్గు గనులు కేవలం 1958 సంవత్సరం మొదటి ఆరు నెలల్లోనే నెలకొల్పబడ్డాయి. స్థానికంగా ఏర్పడ్డ కొత్త పరిశ్రమల్లో అధికభాగం వ్యవసాయ అవసరాల్ని తీర్చడానికే ఏర్పడ్డాయి.

## ఉక్కు పరిశ్రమలు

ఈ సంవత్సరం 107 లక్షల టన్నుల ఉక్కు ఉత్పత్తి చేయాలన్న లక్ష్యంతో దేశవ్యాపితంగా మహోద్యమం సాగుతోంది. ఇంతవరకు కనీవినీ ఎరుగనంతటి అభివృద్ధి ఇనుము, ఉక్కు ఉత్పత్తిలోను, పెట్టుబడి నిర్మాణంలోను గొప్ప అభివృద్ధి సాధించబడింది. చైనా గణాంకశాఖవారు ప్రకటంచిన లెక్కల్నిబట్టి చూస్తే, ఈ సంవత్సరం ఆగస్టునెల నాటికి ఉక్కు ఉత్పత్తి 21 లక్షల 10 వేల టన్నులకు పెరిగిందని తేలింది. ఈ మొత్తం ఇంతకుముందు 7 నెలల్లో జరిగిన మొత్తం ఉక్కు ఉత్పత్తికన్నా 60 శాతం ఎక్కువన్నమాట.

## బ్రిటన్‌తో పోటీ

దేశీయంగా జరిగే ఉక్కు ఉత్పత్తి సంగతి అలావుంచి. యిక బ్రిటన్‌తో పోటీ పడడానికి చైనా నిశ్చయించుకుంది. బ్రిటన్‌లో ఉక్కు పరిశ్రమాభివృద్ధి చాల మందకొడిగా, ఒడుదుడుకులతో సాగుతోంది. 1957లో బ్రిటన్ ఉక్కు ఉత్పత్తి 2 కోట్ల 20 లక్షల టన్నులు. బ్రిటన్‌లోని ఇనుము, ఉక్కు పరిశ్రమాభివృద్ధితో పోల్చి చూస్తే, 15 సంవత్సరాలలోపే ఉక్కు ఉత్పత్తిలో బ్రిటన్‌ను అధిగమించిపోగలమని చైనా ప్రజల విశ్వాసం.

వ్యవసాయాభివృద్ధి త్వరితగతిని సాగుతుండడంవల్ల, యంత్ర నిర్మాణ పరిశ్రమలు, రహదార్లు, రవాణా అభివృద్ధి చెంచడంవల్ల ఇనుము ఉక్కు సరుకులకు ఎక్కువ గిరాకీ వుంటోంది.

చైనాలో ఇనుము, ఉక్కు పరిశ్రమల అభివృద్ధికి సంబంధించిన ప్రధానమైన లక్షణా లేవంటే, మధ్యతరహా, లఘు ఉక్కు, ఇనుము

పరిశ్రమలన్నీ స్థానికంగా పెద్ద సంఖ్యలో నెలకొల్పబడుతున్నాయి. అలాగే ఇనుము కరగించే బ్లాస్ఫర్నస్‌లు మధ్యతరహావి, చిన్న తరహావి అనేక రకాలు అధికసంఖ్యలో ఏర్పడుతున్నాయి. ఈ సంవత్సరం 13 వేల బ్లాస్ట్ ఫర్నెస్‌లు నెలకొల్పబోతున్నారు. కొన్నికొన్ని పరిశ్రమలు రోజుకి 58 వేల 22 టన్నుల ఉక్కును, 292 580 టన్నుల దుక్క ఇనుమును ఉత్పత్తిచేసిన ఉదాహరణలు యిక్కడ వున్నాయి. ఈ రేటున ఈ సంవత్సరాంతానికి చైనా ఉక్కు, ఇనుము పరిశ్రమ 2 కోట్ల టన్నుల ఉక్కును, 10 కోట్ల టన్నుల దుక్క ఇనుము ఉత్పత్తి చేస్తుంది.

## ఉక్కు పరిశ్రమలకు పెట్టుబడి:

ఇనుము, ఉక్కు పరిశ్రమల్ని నిర్మించడానికి కేంద్ర, స్థానిక అధికారులే పెట్టుబడి సమకూరుస్తారు. వీరీ పెట్టుబడిని పరిపాలనా శాఖల్లోను, యితరత్రా అయ్యే దుబారా ఖర్చుల్ని తగ్గించుకోడంద్వారా సమకూర్చగల్గుతారు. వ్యవసాయక, చేతి వృత్తులకు సంబంధించిన సహకార సంస్థలుకూడా పెట్టుబడిని సమకూరుస్తుంటాయి. ఇంతకీ ఉద్దేశం ఏమంటే - ముందు అయినకాడికి చిన్న చిన్న పరిశ్రమల్ని నెలకొల్పుకోడం, ఆ తర్వాత పెద్ద పరిశ్రమల్ని. ఎందుచేతనంటే పెద్దవాటి కన్నా లఘు పరిశ్రమల్లో త్వరితగతిని పని ప్రారంభించడానికి అవకాశముంటుంది. వీటిల్లో వచ్చే లాభాలద్వారా వీటిని విస్తృతం చేయడమే కాకుండా అధికోత్పత్తికి అనుగుణ్యంగా వాటిని పునర్నిర్మించడానికి అవకాశముంటుంది.

అన్నింటికంటే ముఖ్యమైన విషయమేమంటే స్థానికంగా లభ్యమైన ప్రతి సాధన సంపత్తి ఆధారంతోనే ఈ పరిశ్రమల్ని నెలకొల్పుకున్నారు. చిన్న చిన్న బ్లాస్ ఫర్నెస్‌లు వున్నాయనుకోండి. వీటిని కేవలం ఉక్కుతోనే తయారుచేయలేదు. కొంతభాగం మాత్రమే ఉక్కుతో తయారు చేస్తున్నారు. ఉదాహరణకు "సిచూజాన్"

ప్రాంతంలో నెలకొల్పబడ్డ 400 చిన్నతరహా బ్లాస్ట్ ఫర్నేస్‌లలో అధిక భాగం స్థానికంగా లభ్యమైన ఇసుక, రాతితో కట్టబడినవే.

ఇదేవిధంగా ఉక్కు, ఇనుము పరిశ్రమల్లో గొప్ప సాంకేతికాభివృద్ధికూడా సాధించబడుతూంది. అనేక కొత్త పద్ధతుల్ని కనిపెడుతున్నారు.

# యంత్రనిర్మాణ పరిశ్రమలు

1958 సంవత్సరం మొదటి 6 నెలల్లోనే దేశమంతటా పట్టణాల్లోనూ, పల్లెపట్టులా యంత్రనిర్మాణానికి సంబంధించిన వర్క్‌షాపులు వెలిశాయి. యంత్రనిర్మాణ పరిశ్రమ మూడు పూవులు ఆరుకాయలుగా వృద్ధిపొందుతోంది. అనేక పరిశ్రమల్లో ఉత్పత్తి లక్ష్యాలు నానాటికి అధికతరమవుతున్నాయి. ప్రభుత్వ లెక్కల్నిబట్టి చూస్తే, 1958 మొదటి అర్ధసంవత్సరంలోను యంత్రనిర్మాణ పరిశ్రమలు గత సంవత్సరంకన్నా 68.5 శాతం హెచ్చు. ఈ పరిశ్రమలనుండి జరిగిన యంత్రాల ఉత్పత్తి గత సంవత్సరం మొదటి 4 నెలలకన్నా యీ సంవత్సరం మొదటి నాలుగు నెలల్లోను 40.28 శాతం అధికం. అలాగే ఏప్రిల్‌కన్నా మేలో 7.22 శాతం, మే కన్నా జూన్‌లో 14.62 శాతం పెరిగింది. ఉదాహరణకు యంత్రనిర్మాణ పరిశ్రమకు ప్రసిద్ధిచెందిన "షాంఘై మెషీన్ టూల్ వర్క్స్" మొదట్లో అనుకున్నట్లు 1200 యంత్రాలు గాక, 3,100 యంత్రాల్ని ఉత్పత్తిచేయడానికి యత్నిస్తోంది. ఇదే సమయంలో 40 కొత్త యంత్రపరికరాల్ని పయారుచేయడమే గాక, ఈ సంవత్సరం మొత్తంమీద 100 కొత్తరకాల్ని కూడ తయారుచేస్తుంది.

నేడు చైనా గ్రామీణ ప్రాంతా లన్నింటికి వ్యవసాయ యంత్రాల అవసరం ఎంతో వుంది. రైతాంగానికి నేడు అన్ని రకాల ట్రాక్టర్లు, వ్యవసాయ పనిముట్లు అవసరమైనాయి. మానవ శ్రమశక్తిని తగ్గించడమూ, దాన్ని మరో కార్యానికి వినియోగించడమే వీటి లక్ష్యం. వర్షాభావానికి, వరదనివారణకు సంబంధించిన డ్రెయినేజ్, ఇరిగేషన్ యంత్రాలు అవసరమైనాయి. అలాగే వ్యవసాయ సరుకుల రవాణాకు

తగిన బళ్లు కావాల్సి వచ్చాయి. అందుచేత యీ అవసరా లన్నింటినీ తీర్చడానికి యంత్ర పరిశ్రమలు అవసరమయ్యాయి. ఇందుకు అనుగుణ్యంగానే సోషలిస్టు మహా వ్యవస్థ పాటవంవల్ల, చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంవల్ల కార్మికవర్గమంతా నడుం బిగించి, రైతాంగ ప్రజలతో కలసి ఒక్క అర్ధ సంవత్సర కాలంలోనే 11 కోట్ల 90 లక్షల వ్యవసాయ పనిముట్లను, యంత్ర సహాయంతో నడిచే అనేక వ్యవసాయ పనిముట్లను తయారుచేశారు. అంతేగాదు, వ్యవసాయానికి పనికివచ్చే అనేక రసాయనిక యంత్ర సామాగ్రి, ఉపపరిశ్రమలకు కావాల్సిన ప్రోసెసింగ్ యంత్రాల్ని ఉత్పత్తి చేసుకున్నారు. 1957 సంవత్సరాంతానికి చైనాలోని యంత్రనిర్మాణ పరిశ్రమ లింకా ట్రాక్టర్లను ఉత్పత్తి చేయడం ప్రారంభం కాలేదు. కాని వ్యవసాయోత్పత్తిలో సాధించిన విజయాలతో కార్మికుల్లో వుత్సాహం, వూపువచ్చాయి. అందినంతమట్టుకు సాంకేతిక పరిజ్ఞానాన్ని అందుబాటులోకి తెచ్చుకున్నారు. 100 రకాలకు పైగా ట్రాక్టర్లను తయారుచేశారు. వీటిల్లో మామూలుగా చేతితో తీసుకు వెళ్ళే ట్రాక్టర్లు యిక్కడ వున్నాయి. (ఈ రకం ట్రాక్టరును ఈ పుస్తకంలో ప్రచురించిన బొమ్మలలో చూడవచ్చు. అను॥) వీటన్నింటిలోకి "ఎర్రజెండా" ట్రాక్టర్ ("Red Flag") గొప్పది. ఈరోజున అనేక ఫాక్టరీలు పెద్దఎత్తున ట్రాక్టర్లను ఉత్పత్తి చేస్తున్నాయి. ఈ సంవత్సరాంతానికి వేలాది ట్రాక్టర్లు చైనా ఫ్యాక్టరీలనుండి ఉత్పత్తి గానున్నాయి.

యంత్ర నిర్మాణ పరిశ్రమలకు మరో బాధ్యతకూడా వుంది. ఏమంటే - గ్రామసీమ లన్నింటికి ఆధునిక రాకపోకల సౌకర్యాలు, రవాణా సదుపాయాలు కల్గించాలి. పాత బళ్ళనుకూడ అభివృద్ధి చేయాలి. మోటారు పరిశ్రమ సప్లయిచేసే లారీలు కాక, యంత్ర పరిశ్రమల శ్రమశక్తిని తగ్గించేందుకై పాతబళ్ళ స్థానే కొత్త తరహా "బాల్‌బేరింగ్స్"ను అనేకం ఉత్పత్తి చేశారు. ఉదాహరణకు ఒక్క హోవాన్ రాష్ట్రంలోని సూచాంగ్ జిల్లాలోనే జూలై నాటికి 583 "బాల్‌బేరింగ్" ఫ్యాక్టరీల్ని నెలకొల్పారు. 1957 సంవత్సరాంతానికి చైనాలో ఒకేఒక్క మోటారు కార్ల పరిశ్రమ వుంది. కాని నాటినుండి నేటివరకు దేశమంతటా తలెత్తు

తున్న సహజమైన స్థానికావసరాల దృష్ట్యా వివిధ పనులకు వుపకరించే అనేక రకాల మోటారు కార్లు తయారైనాయి.

## ఎరువుల పరిశ్రమలు

గ్రామీణ ప్రాంత ప్రజల అవసరాల్లో రసాయినిక ఎరువుల వాడకం ఒకటి. ఎటిని ఉత్పత్తి చేయాలంటే యంత్రాలు అవసరం. ఈ యంత్రాల్ని తయారుచేయడానికి యంత్రపరిశ్రమ అవసరమేగదా మరి. చైనా ప్రభుత్వం నేడు ఎరువుల్ని తయారుచేసే యంత్రాల్ని ఉత్పత్తి చేసేందుకని ఒక బ్రహ్మాండమైన పరిశ్రమను నెలకొల్పుతోంది. నత్రజని ఎరువుల ఉత్పత్తికి కావలసిన పరికరాల్ని ఈశాన్య చైనాలోను, షాంఘైలోను ఉత్పత్తి చేసిచూశారు. దీనిలో విజయం సాధించారు. 2,400 అశ్వ శక్తి (Horse - power) గల నత్రజని, ఉదజని "కంప్రెసర్" ను ఈశాన్య చైనా యంత్ర నిర్మాణ పరిశ్రమలో తయారుచేశారు. ఈ యంత్రం సంవత్సరానికి 50 వేల టన్నుల నత్రజని ఎరువుల్ని ఉత్పత్తి చేస్తుంది. ప్రస్తుత మిది పెద్ద ఎత్తున ఎరువుల్ని ఉత్పత్తి చేస్తోంది. ఈ సంవత్సరం ఆగస్టు నెలాఖరునాటికి, సంవత్సరానికి లక్ష టన్నుల నత్రజని ఎరువుల్ని ఉత్పత్తి చేయగల యంత్రాన్ని హోపింగ్ యంత్ర నిర్మాణ పరిశ్రమలో కనిపెట్టారు.

## ఉక్కు పోత యంత్రాలు

వీటికోసం గతంలో విదేశ దిగుమతుల మీద ఆధారపడవలసి వచ్చేది. కాని నేడు దేశంలోనే ఉక్కు పరిశ్రమాభివృద్ధి వురకలు వేసుకుంటూ పోతూవున్నప్పుడు ఉక్కు పోతయంత్రాల అవసరం చాలా వుంది. భారీ యంత్రనిర్మాణ పరిశ్రమలే కాకుండా, చిన్నతరహా యంత్ర పరిశ్రమలు, యంత్రపరికరాల్ని ఉత్పత్తిచేసే పరిశ్రమలు కూడా నేడు ఉక్కు పోతయంత్రాల్ని విరివిగా ఉత్పత్తి చేస్తున్నాయి. ఉదాహరణకు "సీచువన్ రాష్ట్రంలోని" వాంగ్ కియాంగ్ యంత్రనిర్మాణ పరిశ్రమ ఒక్క నెలరోజుల్లోనే ఉక్కుపోత యంత్రసామాగ్రి నంతనీ ఉత్పత్తి చేసింది. ఈ యంత్ర పరికరాల మొత్తం బరువు 100 టన్నులుంటుంది. ఇవి

సంవత్సరానికి 50 వేల టన్నుల ఉక్కును పోతపోయగలవు. అలాగే అనేక పరిశ్రమల్లో ఉక్కు పోతపోసే యంత్రాలు తయారవుతున్నాయి. అలాగే అతి సామాన్యమైన యంత్రపరికరాల్ని తయారుచేయడంలో కూడా చైనా కార్మికవర్గం ఘనవిజయాల్ని సాధిస్తున్నారు.

ఒకవైపున యంత్రోత్పత్తి అధికమవుతోన్నా. మరోవేపున వేల కొలది కొత్త ఫ్యాక్టరీల నిర్మాణం జరగడంతో యంత్ర పరికరాల కొరత ఏర్పడుతోంది. దీనికి మార్గ మేమిటి ? సాంకేతిక విప్లవాన్ని తీసుకొచ్చినవారికి తెలియదంటూ ఏముంది ? అప్పుడే ఇందు కొక కిటుకు కని పెట్టారు. తక్షణావసరాల్ని తీర్చేందుకై చైనా కార్మికులు సిమెంటు కొయ్య సామాగ్రితోను అనేక యంత్రాల్ని నిర్మిస్తున్నారు. ఉదాహరణకు చుంకింగ్ ప్రాంతాన్నే పరిశీలించుదాం. మొట్టమొదట్లో "చుంకింగ్ ఎయిర్ కంప్రెసింగ్ వర్క్స్" వారు ఒక పెద్ద యంత్రాన్ని తయారు చేశారు. దీని అడుగు భాగము. దాని ఆకారముకూడ సిమెంటుతో తయారుచేసినవే. ఆ తర్వాత ఈ పద్ధతిని అనేక ఫ్యాక్టరీలు అనుసరించాయి. అక్కడినుండే "సిమెంటును ఉక్కుగా వాడండి. కలపని యంత్ర పరికరాలుగా వుపయోగించండి" అనేది ఒక నినాదంగా మారింది. ఇప్పుడు కార్మికులంతా సిమెంటు. కలప ముక్కలతోనే యంత్రాల్ని ఉత్పత్తి చేస్తున్నారు ! 'క్రేన్ల' ను కూడా కొయ్యతోనే తయారుచేస్తున్నారు. 'క్రేన్లు' ఉక్కుతోనే తయారుకావాలనే మొండి సిద్ధాంతానికి కాలదోషం పట్టింది ! ఉదాహరణకు వాంగ్‌కియాంగ్ యంత్ర పరిశ్రమ వారు " 11 మీటర్లు వెడల్పు గల 5 టన్నుల కొయ్య క్రేను'' ను తయారు చేశారు.

ఆ విధంగా పైన వివరించినట్లు అందుబాటులో వున్న ప్రతీ పద్ధతిని. పరికరాన్ని సక్రమ వినియోగం చేసుకోవడంవల్ల ఆర్థికంగాను, రాజకీయంగాను చాల ప్రాముఖ్యత వుందనేది స్పష్టమైంది. పై చెప్పిన రీతిగ అనేక కొత్త యంత్రాలుకూడ ఉత్పత్తి అవుతున్నాయి. ఉదాహరణకు స్టీమ్ టర్బైన్ జనరేటర్లు. ఇవి కొన్ని కోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తాయి. 10 వేల అశ్వశక్తికి మించిన డీజిల్

యింజన్లు తయారవుతున్నాయి. 10 వేల టన్నులకు మించిన బరువు గల నౌకలు ఉత్పత్తి అవుతున్నాయి. ద్వితీయ ప్రణాళికా కాలంలో (1958 - 62) భారీ యంత్రాల ఉత్పత్తి ప్రధమ పంచవర్ష ప్రణాళికా కాలంలో జరిగిన ఉత్పత్తికన్నా అనేకరెట్లు హెచ్చుగ జరుగుతోంది.

## లఘు పరిశ్రమలు

నూతన పారిశ్రామిక సంస్థలు పెద్ద ఎత్తున నెలకొనడంతోపాటు, దేశమంతటా లఘు పరిశ్రమలు (Small scale industries) కూడా బాగుగా అభివృద్ధి చెందుతున్నాయి. గత ఆరునెలలోను ఏర్పడ్డ 33 లక్షల స్థానిక పారిశ్రామిక సంస్థల్లోనూ 30 శాతం లఘు పరిశ్రమలే.

1957వ సంవత్సరం మొదటి అర్ధసంవత్సరంతో పోల్చితే యీ సంవత్సరం మొదటి ఆరునెలల్లోను లఘుపరిశ్రమల్లో జరిగిన ప్రధాన సరుకుల ఉత్పత్తి ఇలా వుంది : రబ్బరు చెప్పులు 40%, యంత్ర సహాయంతో తయారయిన కాగితం 30%; ఉప్పు 25%; పంచదార 24%; అట్టలు 24%; సిగరెట్లు 11%; వనస్పతి, పప్పునూనె లాంటివి 60%. ఈ సంవత్సరానికి వేసుకున్న ఈ క్రింది ప్రధాన వస్తువుల ఉత్పత్తి లక్ష్యాలు మించిపోతాయని చైనాప్రజలు గట్టిగా చెపుతున్నారు: కాగితం, అట్ట, రబ్బరుచెప్పులు, సైకిళ్లు, కుట్టుయంత్రాలు, తోళ్లు, తోళ్ళచెప్పులు, అగ్గిపెట్టెలు, ఎనామిల్ బేసిన్లు, కప్పులు, ధర్మోమీస్ఫ్లాస్కులు, పెన్నులు, పెన్సిళ్లు, టిఫిన్‌కాన్‌లు నూనెలు, పంచదార, ద్రాక్ష, సారా, ఉప్పు, సిగరెట్లు, సబ్బులు. గత ఆరునెలల్లోనూ వివిధరకాల వస్తువుల వాడకం బాగా పెరిగింది. వీటన్నింటి ఉత్పత్తిలోకూడా చైనాప్రజలు శాస్త్రీయ పద్ధతుల్ని అవలంబిస్తున్నారు. ఉదాహరణకు పెకింగ్, టాన్‌సిన్, సియాయన్ రాష్ట్రాలలో కాగితం పరిశ్రమల్లో కొత్తపద్ధతిని కనిపెట్టారు. దీన్ని "కంటిన్యుయీస్ పల్పింగ్ప్రోసెస్" అంటారు. అంటే ఎప్పుడూ గుజ్జు తీస్తూండే పద్ధతి అన్నమాట. ఈ పద్ధతిని చైనాలోని కాగితం పరిశ్రమలన్నీ అవలంబించితే, సంవత్సరానికి 4 లక్షల టన్నుల కాగితం ఉత్పత్తి అవుతుందని అంచనావేశారు. "చింగ్‌టాచెన్" ప్రాంతంలోని

పింగాణీ పరిశ్రమలో పనిచేస్తున్న 40 వేల మంది కార్మికులు, నిపుణులు కలిసి 200 రకాల పరికరాల్ని, కొత్త సాంకేతిక పనిముట్లను కనిపెట్టారు.

షాంఘైనగరంలో 1246 కొత్త తరహా వస్తువుల్ని తయారు చేశారు. ఇందులో 200 రకాలు నాణ్యంకలవి. కొన్ని మరింతనాణ్యం కలవి. కొత్తగా తయారుచేయబడ్డ వస్తువుల్లో ప్రధానమైనవి : సెమీ కండక్టర్ రేడియోసెట్లు, కెమేరాలు, మించివేగంగల కుట్టుయంత్రాలు, 17 జ్యూయల్ చేతిగడియారాలు; మోటారుకార్లకు వుపయోగించే బ్యాటరీ గడియారాలు; అలారం గడియారాలు; మోటార్ సైకిళ్లు; ఎలక్ట్రో చైనీస్ టైప్‌రైటర్లు కళ్ళద్దాలు మొదలైన వివిధరకాల ప్రత్యేక తరగతికిచెందిన అద్దాలు, వివిధరకాల ప్లాస్టిక్‌సామాగ్రి, రేపులు, ప్లయివుడ్; కాగితం తయారుచేసే కొయ్యయంత్రాలు మొదలైనవి. గత అరునెలల కాలంలో తయారుచేయబడ్డ ఈనూతన వస్తువులన్నీ కార్మికులు తయారుచేసినవే. ఇదేవిధంగా కృత్రిమంగా ముడిసరుకుల్ని కూడా ఉత్పత్తిచేస్తున్నారు. ఉదాహరణకు కృత్రిమ సారా ఉత్పత్తికి అనేకానేక ఉపపదార్థాల్ని కనిపెట్టారు.

## బట్టలపరిశ్రమ

బట్టల పరిశ్రమలో 1958 సంవత్సరం ఒకమైలురాయి. ఇప్పుడు ద్వితీయ ప్రణాళికకూడా ప్రారంభమైంది. సరిగ్గా ఈ సంవత్సరంలోనే బట్టలపరిశ్రమ అనేక విజయాల్ని సాధించింది.

చైనా అంతటా నేడు 10 లక్షలమంది బట్టలమిల్లు కార్మికు లున్నారు. అనేక విధాలుగా నేడీపరిశ్రమ ఉచ్చస్థితిలో వుంది. అనుకున్న లక్ష్యాలకంటే మించి బట్టలఉత్పత్తి జరుగుతోంది. ఈ సంవత్స రాంతా నికి ప్రణాళికా లక్ష్యాన్ని మించి 25 శాతం ఎక్కువ ఉత్పత్తి అవుతుంది. గతసంవత్సరం బట్టలఉత్పత్తితో పోల్చితే ఈ సంవత్సరం ఉత్పత్తి 40 శాతం ఎక్కువ వుంటుంది. నాణ్యమైన ఉన్నివస్త్రాలు గాని, మామూలుబట్టలు గాని 40 శాతానికి మించే ఉత్పత్తి అవుతాయి. షాంఘైలోని బట్టల మిల్లులు ఈ సంవత్సరం గతసంవత్సరంకన్నా 30

నుండి 40 శాతంవరకు ఎక్కువఉత్పత్తి చేశాయి. ఉత్పత్తి పెరుగుదలతో పాటు సరుకులనాణ్యం కూడా బాగా పెరిగింది. ఒక్క హోపీరాష్ట్రంలోని బట్టలమిల్లులే వెయ్యిరకాల కొత్తసరుకుల్ని ఉత్పత్తిచేశారు. వీటి ఉపయోగం కూడా విరివిగానే వుంది.

లోగడ శాస్త్ర సాంకేతికాభివృద్ధి సాధించడం అంటే ఎంతో గొప్ప విషయమని, అందుబాటులో వుండని విషయమని అనుకుంటూ వుండేవారు. కాని చైనా కార్మికులు ఈ పాత అభిప్రాయాల్ని విడిచిపెట్టారు ఇప్పుడు తామే నూతన సాంకేతిక విలువల్ని సృష్టిస్తున్నారు. ఉదాహరణకు 'సింగ్ టాహా' షాంఘైలలో ఎక్కువ వేగంతో తిరిగే అల్లికయంత్రా న్నొకదాన్ని కనిపెట్టారు. ఇది ప్రస్తుతమున్న యంత్రం కంటే4 రెట్లు ఎక్కువపని చేస్తుంది' అలాగే మరికొన్ని ప్రదేశాలలో కొత్త తరహా నేత మగ్గాల్ని. కదుళ్ళను తయారుచేశారు.

శాస్త్ర విజ్ఞాన రంగంలో సాధించిన నూతన విజయాలు—సెమీ కండక్టర్లు. సూపర్‌సానిక్ పరికరాలు వగైరా సామగ్రిని బట్టల పరిశ్రమాభివృద్ధికి ఎలా వినియోగించుకోడమా అని ప్రస్తుతం ఆలోచిస్తున్నారు.

వీటన్నింటికితోడు ప్రజల అవసరాల్ని తీర్చాలన్నా. వున్న ముడి సరుకుల్ని వినియోగించుకోవాలన్నా యింతకంటే బృహత్తర కృషి జరగాలి. అంటే దేశమంతటా కొత్తగా మరికొన్ని బట్టల పరిశ్రమల్ని నెలకొల్పుకోవాలన్నమాట. అంటే కేంద్ర. స్థానిక పరిశ్రమలన్నిటిని ఒకేదఫాగా అభివృద్ధి చేయాలి. అలాగే లఘు పరిశ్రమల్ని కూడా త్వరిత గతిని అభివృద్ధిచేయాలి. వీటన్నింటిలోను సాంప్రదాయకంగా వస్తున్న మంచి పద్ధతుల్ని. అధునికపద్ధతుల్ని సక్రమ వినియోగంలోకి తెచ్చుకోడానికి నేడు చైనా కార్మికులు కృషిచేస్తున్నారు.

చైనా ద్వితీయ ప్రణాళికా లక్ష్యాల్ని బట్టిచూస్తే. ఈ సంవత్సరాంతానికి ఇప్పుడున్నవికాక అదనంగా 20 లక్షల కదుళ్ళు ఉత్పత్తి అవుతాయి. ఈ మొత్తం గత 8 సంవత్సరాల్లో జరిగిన మొత్తం కదుళ్ళ ఉత్పత్తిలో 80 శాతం ఉంటుంది. లేదా దేశ విముక్తికి ముందు 60 సంవత్సరాల్లో జరిగిన ఉత్పత్తిలో 40 శాతం వుంటుంది.

అన్వీరాష్ట్ర ప్రభుత్వం ఈ సంవత్సరం 306 బట్టల పరిశ్రమల్ని నెలకొల్పుతోంది. వీటిలో 3 మిల్లులు పెద్దవి. మధ్యతరహావి 14 మిల్లులు, చిన్నతరహా మిల్లులు 289.

ఈ మిల్లులకయే పెట్టుబడిఖర్చు కూడా తక్కువగానే వుంది. 50 వేల కదుళ్ళుగల బట్టలమిల్లు నొకదాన్ని 1 కోటి 60 లక్షల రూపాయలతో షన్సీ రాష్ట్రంలోని "యూట్సూ" కౌంటీలో నెలకొల్పారు. ఇంతే శక్తిగల పత్తిమిల్లును స్థాపించాలంటే 2 కోట్ల 60 లక్షలయ్యింది లోగడ. అంటే ఒకకోటి రూపాయలు ఆదా అయిందన్న మాట! మరో ఉదాహరణ: అన్వీరాష్ట్రంలో 2 వేల కదుళ్ళుగల ఒక పరిశ్రమను పాత పరికరాలతోను, పాతబడిపోయిన భవన సామగ్రితోను నిర్మించారు. దీనికి 40 లక్షల రూపాయలయింది. దీని నిర్మాణం ఒక్క నెలలోనే పూర్తయింది.

ఈ సంవత్సరం వ్యవసాయోత్పత్తి అధికంగా జరగడంవల్ల, పత్తిపంటకూడా బాగా పండుతుందని చైనావారంటున్నారు. ఈ సంవత్సరం 7 కోట్ల పికిల్స్ (పికిల్ = .05 టన్ను) పత్తి పండుతుంది.

ఇది 1957 నాటి పంటకన్నా రెట్టింపు.

## విమాన పరిశ్రమ

చైనాలో స్వంతంగా విమానాలను తయారుచేయడం ఈమధ్యనే ప్రారంభమైనప్పటికీ, యిప్పటికప్పుడే ఆ పరిశ్రమ ఎంతో అభివృద్ధి పొందింది.

మంచూరియాలోని హార్బిన్ విమాన ఫ్యాక్టరీలో ఎనిమిదిమంది కూర్చొని ప్రయాణం చేయగల ఒక కొత్తరకం రవాణా విమానం ఇటీవల తయారయిందని నవచైనా వార్తాసంస్థ తెలిపింది. ఈ విమానం నమూనా తయారయిన తరువాత 81 రోజుల్లోనే అసలు విమానం నిర్మాణాన్ని పూర్తి చేశారు.

గత పదిహేను రోజులలోనూ వారొక నాలుగు రకాల విమానాలను చైనాలో తయారుచేసి పరీక్షించారు.

వీటిలో జెట్ తరిఫేదు విమానము, ఎనిమిదిమంది ప్రయాణం చేయగల వేరొక విమానము పెకింగ్ ఫ్యాక్టరీలో తయారయాయి. పెకింగ్‌లోని వైమానిక ఇంజనీరింగ్ కాలేజీ విద్యార్థులు ఒక విమానాన్ని స్వయంగా తయారుచేశారు. ఇదికూడా పరీక్షలో నెగ్గింది. షాంఘై విమాన ఫ్యాక్టరీలో తయారయిన ఒక జల విమానంకూడా పరీక్షలో నెగ్గింది.

మరొక ఉదాహరణ: షెన్యాంగ్ వైమానిక ఇంజనీరింగ్ సెకండరీస్కూలు విద్యార్థులు ఒక విమానాన్ని తయారుచేశారు. 1958 అక్టోబరు 12న దీన్ని విజయవంతంగా ప్రయోగించారు. చైనాలో విమానాల్ని తయారుచేసే విద్యాసంస్థలలో ఈ షెన్యాంగ్ వైమానిక ఇంజనీరింగ్ సెకండరీ స్కూలు రెండవది.

ఈ విమానం 65 రోజుల నిరంతర శ్రమఫలితం. గ్రామీణ ప్రాంతాల్లో పంటలను పాడుచేసే క్రిములను చంపే మందుల్ని చల్లడానికి గాని, కృత్రిమంగా వర్షం కురిపించడానికిగాని ఈ విమానాన్ని వినియోగిస్తారు. దీనిలో విమాన చోదకుడు (పైలెట్) కాక ముగ్గురు వ్యక్తులు కూర్చోవచ్చు. దాదాపు గంటకి 110 మైళ్ళ వేగంతో పయనిస్తుంది.

# చేతిపరిశ్రమల అభివృద్ధి

చైనాలో చేతిపరిశ్రమాభివృద్ధి కూడా వేగంగా సాగిపోతోంది. ఈ సంవత్సరం (1958) చేతిపరిశ్రమల ఉత్పత్తి 70 శాతం కంటె ఎక్కువ వుంటుందని అంచనా. చిన్నతరహా కార్యక్రమం నుండి భారీ ఎత్తున ఉత్పత్తికి, యంత్రవినియోగ కార్యక్రమానికి పూనుకోవడం వల్లనే చేతిపరిశ్రమలు ఇంతగా అభివృద్ధి చెందడానికి కారణం.

సాంప్రదాయకంగా వస్తున్న రకరకాల వ్యవసాయ పనిముట్లుగాక, ఈ సంవత్సరం చైనా చేతిపరిశ్రమలు 10 లక్షల 80 వేల టన్నుల ఇనుమూ, 8 లక్షల టన్నుల ఉక్కు, వివిధరకాలకు చెందిన 40 వేలయంత్రపరికరాలు, 1 లక్ష 80 వేల విద్యుదుత్పాదక యంత్రాలు

(Electric generators) మోటార్లను ఉత్పత్తి చేస్తాయి. ఈ సంవత్సరం మొదటి ఆర్నెల్లలోను గతసంవత్సరం మొదటి అర్థసంవత్సరంకన్నా 39.6 శాతం ఎక్కువ సరుకుల్ని ఉత్పత్తి చేశాయి. గతసంవత్సరం చేతిపరిశ్రమలు లేధర్స్. పశువులులాగే వ్యవసాయ పనిముట్లను కొన్నింటిని తయారుచేశాయి. ఈ సంవత్సరం వ్యవసాయోత్పత్తి ఎక్కువ కావడంతో చేతిపరిశ్రమలు-అనేకరకాల మధ్యతరహా లేత్‌లు, ప్లానర్లు, చిన్నతరహా రూలింగ్ మెషీన్లు, మిల్లుయంత్రాలు, డైనమోలు, విద్యుదుత్పత్తి యంత్రాలు, డీజిల్, ఆవిరియంత్రాలు, తోటలకు పనికి వచ్చే ట్రాక్టర్లు, మూడుచక్రాల ట్రక్కులు, మోటార్ సైకిళ్లు, రసాయనిక పదార్థాలు మొదలైనవాటిని ఉత్పత్తి చేస్తున్నాయి.

వినిమయ సరుకులు: అంతేగాదు: చేతిగడియారాలు, కెమేరాలు మొదలైన వాడకం వస్తువుల్నికూడా చేతిపరిశ్రమలు తయారు చేస్తున్నాయి. వీటితోపాటు సాంప్రదాయకంగా ఉత్పత్తిచేస్తున్న కుట్టుపనిముట్లు, కొయ్యపనిముట్లు, లక్కసామాన్లు, తివాసీలు మొదలైనవికూడ తయారు చేస్తున్నారు. కేంద్ర, స్థానిక పరిశ్రమలు; భారీ, మధ్యతరహా లఘు పరిశ్రమలు - ఒకదాని సరసన ఒకటి త్వరితగతిని అభివృద్ధి చెందేటట్లుగా నేడు చైనాకమ్యూనిస్టుపార్టీ సమన్వయపూర్వక విధానాన్ని అనుసరిస్తోంది.

చేతివృత్తుల సహకార సంఘాలు, కో-ఆపరేటివ్ వర్కుషాపులలో నేడు 50 నుండి 60 లక్షలవరకు సభ్యులున్నారు. వీరంతా పరిపాలనా ప్రాంతంస్థాయిలోగాని లేదా కౌంటీగాని అంతకంటే క్రిందిస్థాయిగాని జరిగే మొత్తం స్థానిక పారిశ్రామికోత్పత్తిలో 80 శాతం ఉత్పత్తి చేస్తున్నాయి. ప్రభుత్వరంగంలో వున్న పరిశ్రమల్లాగానే కో-ఆపరేటివ్ వర్కుషాపుల్లోకూడా సోషలిస్టు యాజమాన్యం అమలు జరుగుతోంది. సహకార సంస్థల్లోని సభ్యులు ఈ వర్కుషాపుల్లో స్వంతంగా వాటాలు వుంచుకుంటారు. ఇవి తిరిగి వారికి లభ్యమవుతూ ఉంటాయి. సభ్యులకు మాత్రం దినవేతనాలు ముట్టుతూ వుంటాయి.

స్థానికంగా చేతివృత్తులు అభివృద్ధి చెందుతున్న కొలదీ యంత్రాల అవసరంకూడా కలుగుతుంది. కారణం, తనకే కాకుండా,

యితర స్థానిక పరిశ్రమలకు, వ్యవసాయ రంగానికి కావలసిన పని ముట్లను సప్లయి చేయాలంటే మరి చేతిపరిశ్రమకుకూడా యంత్రాల అవసరం వుంటుంది.

ఇప్పటికే చైనా చేతిపరిశ్రమలకు 80 వేల చిన్నతరహా తేలిక రకం యంత్రపనిముట్లు వున్నాయి. అనేక చేతివృత్తులవారు యంత్రాల్ని రిపేర్ చేయడంలో మంచి అనుభవం సంపాదించుకున్నారు కూడా.

ఈ పరిశ్రమలకు కేంద్ర పారిశ్రామికసంస్థల సహాయం లభించింది. సాంకేతికంగాను, వివిధ పరిశ్రమల శాఖలమధ్య సమన్వయం విషయంలోను, నిపుణులైన కార్మికుల్ని తరిఫీదు చేయడంలోను యింకా యితరత్రా అనేక విధాలుగా కేంద్ర సహాయం లభించింది.

చైనా చేతిపరిశ్రమలు అనేక వేల చిన్నతరహా బ్లాస్టుఫర్నెస్‌లను, "బెస్మార్ కన్వర్టర్ల"ను తయారుచేశాయి. ఇవన్నీ స్థానికంగా లభ్యమైన సామాగ్రితోనే తయారు చేయబడ్డాయి. రోజుల వ్యవధిలోనే తయారు చేసిన అనేక బ్లాస్టుఫర్నెస్‌ల ఖరీదు ఒక్కొక్కటి 200 రూపాయలకు మించివుండదు. ఇవి మంచి నాణ్యంగల దుక్క ఇనుమును (Pig Iron) ఉత్పత్తి చేయగలవు.

ఈ పద్ధతుల్లోనే మరికొన్నాళ్లు చేతిపరిశ్రమాభివృద్ధి కొనసాగితే గ్రామీణ ప్రాంతాల్లోని పట్టణాలు, గ్రామీణ ప్రాంతాలు త్వరితగతిని పారిశ్రామికవంతం గావడానికి మహత్తర అవకాశాలున్నాయని చైనా ప్రభుత్వం భావిస్తోంది.



4 వ ప్రకరణం

# విద్యాభివృద్ధి

1957 - '58 విద్యాసంవత్సరానికి చెందిన లెక్కల్నిబట్టి చూస్తే. చైనా అంతటా ప్రాథమిక పాఠశాలల్లో చదువుకుంటున్నవారి సంఖ్య— దేశవిముక్తికి ముందు 2 కోట్ల 40 లక్షలమంది వుంటే, యిప్పుడు సంఖ్య 6 కోట్ల 40 లక్షల పైచిలుకు వుంది. అలాగే మాధ్యమిక పాఠశాలల్లో (మిడిల్ స్కూల్స్) చదువుకుంటున్నవారి సంఖ్య— విముక్తికి పూర్వం 10 లక్షలుంటే, ఈనాడు 60 లక్షలున్నారు. వృత్తివిద్య నభ్యసిస్తున్నవారు 3 లక్షల 50 వేలనుండి 7 లక్షల 78 వేలకు పెరిగింది. యూనివర్శిటీ, కళాశాల విద్యనభ్యసిస్తున్నవారి సంఖ్య లక్ష 55 వేలనుండి 4 లక్షల 40 వేలకు పెరిగింది. వీరిలో యింజనీరింగ్ విద్యార్థులు ఒక లక్ష 63 వేలమంది వున్నారు. ఈ సంఖ్య 1947 నాటి కొమిటాంగ్ పరిపాలన నాటికన్న 4.9 రెట్లు ఎక్కువ. కొద్ది సంవత్సరాల్లో విద్యావిధానంలో చైనా యింత అభివృద్ధిని సాధించడానికి కారణమేమిటి? ప్రభుత్వ సహాయమూ, ప్రజల జీవనస్థాయిలో పెంపుదలే - ఇందుకు ప్రధాన కారణాలు.

పారిశ్రామిక. వ్యావసాయక రంగాలలో వచ్చిన అభివృద్ధికి అనుగుణ్యంగానే. చైనా విద్యారంగంలోకూడా బ్రహ్మాండమైన విప్లవకర మార్పులు వస్తున్నాయి. నేడు దేశమంతటా ప్రజలు రాజకీయాలు, సాంస్కృతిక, శాస్త్రవిజ్ఞాన సాంకేతిక విషయాల్నిగూర్చి అత్యంత ఆసక్తి

కనబరుస్తున్నారు. "ఉత్పత్తికి, శ్రామికవర్గ ప్రయోజనాలకి అనుగుణ్యంగా విద్యావిధానం" అనేది నేటి ప్రధాన నినాదంగా వుంది.

చైనాలో నేడు విద్యావిధానం బహు ముఖాలుగా సాగుతోంది. అటు ప్రభుత్వ పాఠశాలల్లోను, ఇటు పారిశ్రామిక, వాణిజ్య సంస్థలు, సహకార వ్యవసాయ సంఘాలు నడిపే పాఠశాలల్లోను ఒకేదఫా అభివృద్ధి సాధ్యమవుతోంది. వివిధ ప్రపంచ విషయాల్ని గూర్చి బోధించే పాఠశాలలు, వృత్తి విద్య, సాంకేతిక శిక్షణకు సంబంధించిన విషయాల్ని బోధించే పాఠశాలలు; వయోజన విద్యా పాఠశాలలు - బాలబాలికల పాఠశాలలు; పగటిపూట పాఠశాలలు, సాయం సమయపు పాఠశాలలు లేదా ఖాళీసమయాల్లో నేర్చుకొనే పాఠశాలలు; రెగ్యులర్ పాఠశాలలు, యింటివద్ద వుండి నేర్చుకొనే పాఠశాలలు (అంటే ఉత్తరప్రత్యుత్తరాల ద్వారాను, రేడియో ప్రసారంద్వారా విద్యాబోధ); జీతం చెల్లించే పాఠశాలలు, ఉచిత బోధనా పాఠశాలలు - ఇన్ని తరగతులుగా చైనాలోని పాఠశాలలు నిర్వహించబడుతున్నాయి. ఫలితంగా విద్యాస్థాయిని పెంచేందుకు ఉద్దేశించబడ్డ రెగ్యులర్‌గ నడిచే ప్రభుత్వ పాఠశాలలతోపాటు ప్రజల్నందర్నీగూడా విద్యావంతుల్ని చేసేందుకని (పాప్యులర్ ఎడ్యుకేషన్) సాయంకాలపు పాఠశాలలు, లేదా ఖాళీసమయాల్లో విద్య నేర్చుకొనే పాఠశాలల్ని మునిసిపాలిటీలు, పంచాయితీలు, ఫ్యాక్టరీలు, వర్తక సంస్థలు, సహకార వ్యవసాయ సంస్థలు నడుపుతున్నాయి. సహకార వ్యవసాయ సంస్థలు నడిపేవాటిలో ప్రాథమిక, మధ్య తరగతి పాఠశాలలే గాకుండా, కళాశాలలు (Colleges) కూడా వున్నాయి. ఈ విద్యాలయా లన్నింటిలోను దాదాపు ఒకే తరహా విద్యాబోధ జరుగుతూ వుంటుంది : ఉత్పత్తికి సంబంధినిన పాఠ్య విషయాలు సిద్ధాంత - ఆచరణల సమన్వయం; ఉత్పత్తి అవసరాలకి, స్థల, కాల, ఉద్యోగ బృందానికి అనుగుణ్యంగాను జరిగే విద్యాబోధ. ప్రధానంగా ఈ విద్యాలయాలన్నీ స్వయం పోషకాలు కావడంవల్ల, యివి ప్రభుత్వ సబ్సిడీలమీద ఆధారపడాల్సిన అవసరం అంతగాలేదు; పైగా విద్యాబోధకు అవసరమైన ఉపాధ్యాయుల్నందర్నీ స్థానికంగానే అర్హులైనవారిని

రిక్రూట్ చేసుకుంటారు. అంచేత స్వయంపోషకంగా నడిచే ఈ పాఠశాలలన్నీ ఉపాధ్యాయుల నియామక విషయం తామే చూచుకుంటాయన్నమాట. ఫలితంగా త్వరితగతిని అభివృద్ధి చెందడానికి అవకాశం కలుగుతోంది. ఈ విధంగా పాఠశాలలన్నీ చైనా పారిశ్రామిక వ్యావసాయికరంగాలలో పనిచేస్తున్న కార్మిక వర్గం సాంకేతికంగా అభివృద్ధిని సాధించడానికి అవకాశాన్ని కలిగిస్తాయి. వారి పని నైపుణ్యం బాగా పెరుగుతోంది. అలాగే వీరి రాజకీయ చైతన్య స్థాయి, ప్రపంచ విజ్ఞానమూకూడా నానాటికి పెంపొందుతున్నాయి.

ఇదే విధంగా సాంకేతికాభివృద్ధికూడా త్వరితగతిని కొనసాగిపోతోంది. ఉదాహరణకు: హోనాన్ రాష్ట్రంలోని మెంగ్‌చిన్ కౌంటీకి చెందిన ఒక సహకార వ్యవసాయ కళాశాలవిషయం తీసుకోండి: సహకారసంఘ సభ్యుల అవసరాలను తీర్చేందుకని కళాశాలలో మొత్తం 17 రకాల కోర్సులను ప్రవేశపెట్టారు: రాజకీయ విజ్ఞానశాస్త్రం, న్యాయశాస్త్రం; వ్యవసాయం, పరిశ్రమలు; హైడ్రో మెకానిక్స్; రసాయనశాస్త్రం; తెగుళ్ళ క్రిమిసంహారణకు నివారణకు సంబంధించిన శాస్త్రం; వ్యవసాయ వాతావరణశాస్త్రం; సర్వే, అటవీశాస్త్రం; పశుపోషణ; అర్థశాస్త్రం, సాంఘిక సంక్షేమం; వైద్యవిద్య, లలితకళలు; శరీరశిక్షణ, చైనా, రష్యన్ భాషలు. వయస్సు ఎంత వున్నా, వారికి గత విద్యానుభవం ఎంత వున్నా లేకపోయినాకూడా సహకారసంఘ సభ్యులంతా ఈ వ్యవసాయ కళాశాలలో చేరవచ్చు. ఈ కళాశాలల్లో అధ్యయన తరగతులు ఈ క్రింది విధంగా విభజించబడి వుంటాయి: రాజకీయాల్ని అందరూ కలసి అధ్యయనం చేస్తారు; వివిధ తరగతుల్లో సాంకేతిక - టెక్నికల్ - విషయాల్నిగూర్చి అధ్యయనం చేస్తారు; సాంస్కృతిక విషయాలను బోధించేందుకు ప్రత్యేక తరగతులుంటాయి. పరిశోధన - రిసెర్చి - తరగతి, ఫ్యాక్టరీ, గని, పొలంపనికి సంబంధించిన విషయాలు అనే మూడు తరగతులుంటాయి. ఫలితంగా విద్యాబోధనకి - ఉత్పత్తి పనికి మధ్య అత్యంత సన్నిహితసంబంధం ఏర్పడుతోందన్నమాట. ఇక బోధన (Teaching) కు సంబంధించినంతవరకు ఈ క్రింది

సూత్రంమీద ఆధారపడి వుంటుంది: "విషయం ఎవరికి బాగా తెలిస్తే అతను ఉపాధ్యాయుడు ప్రతి ఒక్కడూ ప్రతివాడినుండి నేర్చుకుంటూ వుంటాడు". ఉపాధ్యాయుడు, విద్యార్థి - ఉభయులూ ఉత్పత్తికి సంబంధించిన ప్రతీ పనిలోనూ పాల్గొంటారు. పనిపాట్ల విషయంలోగాని. అధ్యయనంచేసే విషయంలోగాని, లేదా శరీర శ్రమకు - మానసిక శ్రమకు మధ్యగాని విభేదాలు పొడసూపవు. కార్మికులూ. రైతులూ- విద్యార్థులే. అలాగే ప్రతీ విద్యార్థి కార్మికుడూ, రైతూను. ఆ విధంగా ప్రతివాడూ తనుబ్రతికున్నంతకాలమూ ఇతర్లనుంచి నేర్చుకుంటూనే వుంటాడు. పైన వివరించిన వివిధ రకాల పాఠశాలలకు అద్యతన భావిలో మంచి భవిష్యత్తు వుందని చైనాప్రజలు ఆశిస్తున్నారు.

గత జూన్‌మాసంనాటికి మొత్తం 15 రాష్ట్రాల్లో సేకరించినలెక్కల్ని బట్టి, 1517 కౌంటీలలో నిర్బంధ ప్రాథమిక విద్యావిధానం అమలులో వుంది. ఈ సంఖ్య, మొత్తం చైనాలోని కౌంటీలు, మునిసిపాలిటీలన్నింటిలోను వున్న నిర్బంధ ప్రాథమిక విద్య కన్న 66 శాతం ఎక్కువ. బడికి వెళ్ళే ఈడువచ్చిన పిల్లల్లో 83 శాతం నేడు చదువుకుంటున్నారు. వృత్తి విద్యకు సంబంధించిన మాధ్యమిక పాఠశాలలు 79 వేల 500 కు పెరిగాయి. వీటిలో కొత్తగా చేరిన విద్యార్థుల సంఖ్య 30 లక్షలు.

కొత్త పాఠశాలలు నెలకొల్పడంతోపాటు. ప్రస్తుతమున్న వివిధ పాఠశాలన్నీ, కళాశాలల్ని సంస్కరిస్తున్నారు. వీటన్నింటిలోను సోషలిస్టు విద్యను గూర్చి బోధిస్తారు. దీనిలో వివిధ ప్రాపంచిక విషయాల్ని గూర్చికూడా బోధిస్తారు. చైనా విద్యా విధానం ముఖ్యోద్దేశం: సోషలిస్టు విప్లవలక్ష్యాన్ని నెరవేర్చడం, సోషలిజం నిర్మాణానికి దోహదం చేయడం, దోపిడీవర్గాల్ని, దోపిడీ సమాజ అవశేషాల్ని తుదముట్టించడమే చైనా విద్యావిధానం లక్ష్యం. పట్టణాలకు, పల్లెలకు మధ్య, శారీరక శ్రమకు మానసిక శ్రమకు మధ్యనున్న విభేదాల్ని తొలగించగల కమ్యూనిస్టు సమాజ నిర్మాణమే చైనా విద్యావిధానం ధ్యేయం. చైనాలో నేడు కొత్తతరం పౌరులు తయారవుతున్నారు. వీరంతా సోషలిస్టు

సమాజానికి చెందినవారు. అంటే వీరంతా చదువుకొన్నవారు, రాజకీయ చైతన్యంగలవారు. బూర్జువా సమాజంలోని మేధావివర్గం రాజకీయ చైతన్యంలేక వారితెలివితేటలు కేవలం పుస్తకాలకే పరిమితమైవుంటాయి. పైగా బూర్జువాసమాజంలో ఎంతసేపటికి బుర్రనుఉపయోగించడమేగాని చేతితో ఏ పనిని 'ఇలా' తాకడమంటూ వుండదు. కాని సోషలిస్టు సమాజాన్ని నెలకొల్పుకుంటున్న నేటి చైనాలో మేధావులు ఇటు మానసికంగాను కష్టపడగలరు, అటు శారీరకశ్రమా చేయగల సమర్థులుగా వున్నారు.

ఈ విషయాలు దృష్టిలో పెట్టుకునే గత సంవత్సరం అన్ని పాఠశాలల్లోను, కళాశాలల్లోను "కార్యవిధాన సంస్కరణోద్యమం" (Rectification Campaign) జయప్రదంగా జరిగింది. ఈ ఉద్యమ సమయంలో సోషలిజం - పెట్టుబడిదారీ విధానాల మధ్య ఒక కొత్త తరహా పోటీ తలెత్తింది. ఈ పోటీలో అభివృద్ధి నిరోధక బూర్జువా భావాల్ని సాధ్యమైనంతవరకు ఎదుర్కోడం జరిగింది. శ్రామికవర్గ సిద్ధాంత ప్రాతిపదికమీదనే విద్యావిధానంలో అనేక సంస్కరణలు జరిగాయి. 'సోషలిజా'న్ని గూర్చి ప్రతివారూ ఒక క్రమపద్ధతిలో అన్ని పాఠశాలల్లోను ఉపన్యాసాలివ్వడం జరిగింది. ఈ "కార్యవిధాన సంస్కరణోద్యమం" ప్రభావంవల్ల బూజుపట్టిన పాత అభిప్రాయాల్ని కల్గివున్న ప్రొఫెసర్లు సహితం తమ పాతభావాల్ని మార్చుకోగల్గారు. ఈ రోజున వాళ్ళంతా విద్యార్థులతో కలిసిమెలిసి వుండడం. వాళ్ళ సమస్యలేమిటో అర్థం చేసుకునేందుకు ప్రయత్నించడం పాఠశాల, కళాశాల తరగతులలో జరుగుతున్న అభివృద్ధినిగూర్చి విద్యార్థుల అభిప్రాయాల్ని తెలుసుకోవడమనేది - పరిపాటైంది. అనేకమంది ప్రొఫెసర్లు, ఉపాధ్యాయులు ఫ్యాక్టరీలను, వ్యవసాయ క్షేత్రాల్ని సందర్శించడంకూడ పరిపాటి. ఫలితంగా వారికి విషయసేకరణ సౌలభ్యంగా వుండడమేగాకుండా, "అక్కడికక్కడ" తరగతులు పెట్టి విద్యార్థులకు బోధించడంకూడ చాల అవసరమని భావిస్తున్నారు; అలా సాధ్యపడిందికూడా, దీనిఫలితంగా ఉపాధ్యాయుల, అధ్యాపకుల బోధనాపటిమ ఎంతగానో అభివృద్ధి చెందింది.

## ఉన్నత విద్య

చైనా విముక్తిచెందిన 8 ఏండ్ల లోపలనే, ఉన్నతవిద్యలో అనేక సంస్కరణలు జరిగాయి. ఒక ప్రక్క నూతన విద్యావిధానం రూపొందించబడింది. విద్యాపద్ధతి, విద్యావిషయాలు తీవ్రంగా సంస్కరించబడ్డాయి. సోషలిస్టు నిర్మాణానికి అనుగుణ్యంగా తరిఫీదైన వ్యక్తులు తయారయేందుకు వీలుగా ఉన్నతవిద్యాపథకం రూపొందింపబడింది. స్వాతంత్ర్యం రాకముందు 1947-'48 లో ఉన్నత విద్యాసంస్థలు 207 వుండేవి. అందులో 79 ప్రయివేటు యూనివర్సిటీలు, మత సంస్థల యూనివర్సిటీలు కూడా ఇందులో కలిసేవున్నాయి.

1952 నుండి జాతీయ నిర్మాణ అవసరాలకు అనుగుణ్యంగా యూనివర్సిటీలలో, కళాశాలలోఅనేక మార్పులు తీసుకురాబడ్డాయి. పాత యూనివర్సిటీల నుండి, ఇంజనీరింగ్. వ్యవసాయం, వైద్యం. ఉపాధ్యాయ బోధన, రాజకీయ శాస్త్రం, అర్థశాస్త్రం, లలితకళలు మొదలైన విభాగాలను తీసి. వేర్వేరు సంస్థలుగా వాటిని మార్చారు.

పూర్వం కళాశాలలన్నీ కలసి ఒక యూనిట్‌గా ఉండేవి. ఇపుడలాగాక ఆయా బోధనాశాఖలే పరిపాలక యూనిట్‌గా కొత్త యూనివర్సిటీలలో ఉంటాయి. ఇకనుంచి కొత్త యూనివర్సిటీల, కళాశాలల పంపకం, సర్వతోముఖమైన హేతుయుక్తమైన పథకాన్ని అనుసరించి వుంటుంది; సోషలిస్టు నిర్మాణం అనే దీర్ఘకాల ఆశయాన్ని దృష్టిలో పెట్టుకొని, జాతీయార్థికాభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని నెలకొల్పబడుతాయి: పూర్వంవలె కొద్ది పట్టణాలలో మాత్రమే యూనివర్సిటీలుండే పద్ధతి వుండదు. పారిశ్రామిక విద్యాసంస్థలు క్రమంగా పారిశ్రామిక కేంద్రాలకు కలుపబడతాయి. ఉన్నతవిద్యా సంస్థలు, గ్రామాలలోను, మైనారిటీ జాతుల ప్రాంతాలలోను నెలకొల్ప బడుతాయి.

మైనారిటీ జాతులకై ప్రత్యేకంగా 11 కి పైగా ఉన్నత విద్యా సంస్థలు నెలకొల్పబడ్డాయి. 1956-57 సంవత్సరంలో ఉన్నత విద్యాసంస్థలలో చదివే మైనారిటీ జాతుల విద్యార్థులు 16051 మంది వున్నారు. 1950 తో పోల్చితే ఈ సంఖ్య 11 రెట్లు ఎక్కువ.

1957-'58 లో (కాలేజీలు తెరచి, మూసివేసే లోపున అంటే - ఒకసంవత్సరంలో) 229 ఉన్నతవిద్యా సంస్థలున్నాయి. 1949-'57 మధ్య 4 లక్షల 44 వేలమంది విద్యార్థులు, 70.018 మంది ఉపాధ్యాయులు. 3,58.000 మంది పట్టభద్రులు ఈ ఉన్నతవిద్యా సంస్థలలో ఉన్నారు. పై చెప్పిన 229ఉన్నతవిద్యా సంస్థల్లోను 16యూనివర్శిటీలు. 44ఇంజనీరింగ్ విద్యాసంస్థలు. 28 వ్యవసాయ సంస్థలు, 3 అటవీశాస్త్ర సంస్థలు. 57 మామూలు కళాశాలలు, 5 ఆర్థిక ద్రవ్యశాస్త్రసంస్థలు, 5 రాజకీయ న్యాయ శాస్త్ర సంస్థలు, 8 భాషా సంస్థలు. 6 వ్యాయామ విద్యా సంస్థలు, 17 లలితకళా సంస్థలు, 3 ఇతర సంస్థలు వున్నాయి. పరిశోధన చేసే విద్యార్థులతో సహా మొత్తం ఉన్నతవిద్య నభ్యసించే విద్యార్థుల సంఖ్య 4,44,000. కొమింటాంగ్ పరిపాలనలో విద్యార్థుల సంఖ్య అధికంగా వున్న సంవత్సరం 1947 నాటికన్నా ఇది 187 శాతం ఎక్కువ.

వివిధ శాఖల విద్యార్థుల నిష్పత్తిలోకూడ చాల మార్పు వుంది. 1947 లో సుమారు 17 శాతానికి కొద్దిగా ఎక్కువ ఉన్న ఇంజనీరింగ్ విద్యార్థులు 1957-'58 సంవత్సరంలో 36.95 శాతానికి హెచ్చారు. అదే కాలంలో మామూలు విద్యార్థులు 13.47 నుండి 26.02 శాతానికి హెచ్చారు. వైద్య విద్యార్థులు 7.66 శాతంనుండి 11.3 శాతానికి హెచ్చారు.

1949 నుండి 1957 వరకు అనగా 8 ఏండ్లలోను 3 58,000 మంది పట్టభద్రులున్నారు (graduates). 1912 నుండి 1947 వరకు అంటే, స్వాతంత్ర్యానికి పూర్వపు 36 ఏండ్లలోను మొత్తం 2,10,800 మంది పట్టభద్రులు మాత్రమే వున్నారు. వీరి సంఖ్య పూర్వం 36 ఏండ్లకన్నా గత ఎనిమిదేండ్లలో 170 శాతం హెచ్చిందిన్నమాట.

విద్యార్థుల, విద్యార్థినుల నిష్పత్తిలో కూడా చాల మార్పు వచ్చింది. స్వాతంత్ర్యానికి ముందు 1947 లో విద్యార్థినులు 17.8 శాతం ఉండేవారు. 1957-'58 సంవత్సరంలో 23.3 శాతం ఉన్నారు. వివిధ శాఖల్లో విద్యార్థినుల సంఖ్య 100 కి ఈ క్రింది విధంగా వుంది: వైద్యం

40.2; వ్యవసాయం 28.8; లలితకళలు 25; సాహిత్యశాస్త్రం 18.7; ఇంజనీరింగ్ 18.

ఉపాధ్యాయుల సంఖ్యకూడా చాల హెచ్చింది. 1957-'58 సంవత్సరంలో 70,018 మంది ఉపాధ్యాయులున్నారు. 1947 లో 16,940 మంది మాత్రమే ఉండేవారు. ఇందులో 4615 మంది అంటే 4.93 శాతం అసోసియేట్ ప్రొఫెసర్లు; 17,464 మంది అంటే 24.94 శాతం లెక్చరర్లు; 44.486 అంటే 63 54 శాతం అసిస్టెంట్ లెక్చరర్లు.

చైనాలోని ప్రజా ప్రభుత్వం పెద్ద ఆర్థికసహాయాన్ని, వ్యక్తులనూ యిచ్చి సహాయపడకపోతే ఇలాంటి సత్వరాభివృద్ధి సాధ్యపడేది కాదు. ఉదాహరణకు 1949 నుంచి 1957 వ సంవత్సరాంతం వరకు నిర్మింపబడిన భవనాల స్థలం (ఫ్లోర్‌స్పేస్) 10,850,000 చదరపు మీటర్లకు పైగా వుంది. ఇది 1948 కు పూర్వపు 50 ఏండ్లలో బాగా నిర్మాణంజరిగిన ఏ సంవత్సరం కన్నా కూడా 7,150,000 చదరపు మీటర్లు ఎక్కువ. 1948 కి పూర్వం నిర్మాణం ఉన్నతస్థాయిలో ఉన్న సంవత్సరం 37 లక్షల చదరపు మీటర్లు మాత్రమే ఉండేది.

1952 - 57 మధ్య ఆరేండ్లలో ఉన్నత విద్యకు 284 కోట్ల 'యువాన్లు' (యువాన్ అంటే రెండు రూపాయలతో సమానం) కేటాయించబడ్డాయి. 1928 - 48 మధ్య 19 ఏండ్లలోను కేటాయించబడిన మొత్తం 58 కోట్ల యువాన్లే (కొమిన్‌టాంగ్ ప్రభుత్వ కరెన్సీలో 25,000 కోట్ల యువాన్లు: కొమిటాంగ్ ప్రభుత్వకాలంలో నోట్ల ముమ్మరంవలన కరెన్సీకి విలువ చాల తగ్గిపోయింది— అను॥). పోల్చిచూస్తే స్వాతంత్ర్యానికి పూర్వంకన్నా ఉన్నత విద్యకు సాలీనా అయ్యే ఖర్చు 15.5 రెట్లు వుంది ఇపుడు.



## 5 వ ప్రకరణం

# ప్రజారోగ్యం

ఈగలు, దోమలు, ఎలుకలు, పిచ్చుకలు - ఈ "దుష్టచతుష్ట యాన్ని" తుడిచి పెట్టేందుకని చైనా ప్రజలు ఒక పెద్ద ఉద్యమాన్నే లేవదీశారు. 'ఆరోగ్య రక్షణకై సాగిన మహోద్యమంలో ఇదొక ప్రధాన భాగంగా వుంది. 1952 లో దేశమంతటా ఇదొక దేశభక్తి పూరిత ఉద్యమంగా తయారైంది. ఈ వుద్యమ ఫలితంగానే అనేక ప్రమాద కరమైన రోగాలు సాధ్యమైనంతవరకు రాకుండా నివారించడం జరి గింది.

[ఇటీవల కాలంలో చైనా సందర్శించిన మాజీ బ్రిటిష్ ప్రధాని క్లైమెంట్ అట్లీ. మన మాజీ కేంద్ర ఆరోగ్య శాఖామంత్రి శ్రీమతి అమృత కౌర్ ఈ విషయమై ఎంతగానో మెచ్చుకొన్నారు. శ్రీమతి కౌర్ మన దేశంలో అక్కడి పద్ధతుల్ని కొన్నింటిని అవలంబించాలని కూడా కేంద్రానికి సలహాయిచ్చారు. "అను"] చైనాలోని కొన్ని కౌంటీలలోను. మునిసిపాలిటీలు, ప్రత్యేక పరిపాలనా ప్రాంతాలలోను లేదా రాష్ట్రాల లోను ఈ రోగాలు (కాలా - అజార్; మలేరియా వగైరా) పూర్తిగా నిర్మూలింపబడ్డాయి. ఫలితంగా ప్రజల ఆరోగ్యస్థాయి పెరిగింది.

1957 శీతాకాలంనుండి గడచిన 10 నెలల్లోపున అనేక వేల, కోట్లు ఎలుకలు, పిచ్చుకలు, దోమలు, ఈగలు యింకా యితరత్రా ప్రమా దకర పురుగుల్ని మట్టుపెట్టి నాశనం చేశారు. గత జూలై మాసం మధ్య

కాలంనాటికి 135 కోట్ల ఎలుకలు, 133 కోట్ల పిచ్చుకలు, 6,860,000 కిలోగ్రాముల దోమల్ని, 73 040,000 ఈగల్ని, యితర కీటకాల్ని తుడిచి పెట్టినట్లు ప్రభుత్వ లెక్కలు తెలుపుతున్నాయి. ఇప్పటికి అనేక ప్రాంతాలలో "దుష్ట చతుష్టయం" బెడద పూర్తిగ వదలిపోయినట్లు అధికార ప్రకటనల ద్వారా తెలుస్తోంది.

వీటన్నింటిని మించి పట్టణాల్లోను, పల్లెల్లోను ఆరోగ్య పరిస్థితుల్లో పెద్ద మార్పులు వచ్చాయి. వ్యక్తిగతంగా ప్రతివాడు ఆరోగ్య సూత్రాల్ని అవలంబించడంవల్ల, ఆరోగ్యపరిస్థితుల్లో వచ్చిన అభివృద్ధే ఈ మార్పుకు కారణం.

ఆరోగ్య ఉద్యమంలో దాదాపు అన్ని ప్రాంతాలు మహోత్సాహంతో పాల్గొన్నాయి. ఉదాహరణకు షాంఘై మునిసిపాలిటీలో నూటికి 82 కుటుంబాలు ఈ ఉద్యమంలో పాల్గొన్నాయి. కొన్ని ప్రాంతాల్లో కేవలం ఉద్యమంలో పాల్గొనడమే గాకుండా, ప్రజలు రాత్రింబవళ్ళుకూడా కష్టించి పనిచేశారు. ఉదాహరణకు: హోపే రాష్ట్రంలోని "లాన్‌పింగ్" కౌంటీ ప్రజలు ఈ నినాదం చేపట్టారు: "చేతిలైటునే సూర్యకాంతిగా ఎంచుకోండి, పై నక్షత్రాల్ని చంద్రకాంతిగా భావించుకుందాం. సందుగొందులన్నీ యుద్ధరంగాలుగా ఎంచుకొందాం; గడ్డపలుగులు. పారలు మన ఆయుధాలుగా పట్టుకుందాం. వీటితో ప్రజారోగ్య రక్షణకు, ఈ "దుష్ట చతుష్టయా"న్ని హతమార్చేందుకు మహాపోరాటం సాగిద్దాం." ఉదాహరణకు కీచో రాష్ట్రంలోని 'తుషాన్' కౌంటీ ప్రజలు ఆరోగ్య రక్షణ ఉద్యమం సాగిన 5 రోజులకే ఈ "దుష్ట చతుష్టయా"న్ని తుదముట్టించడంలో విజయం పొందారు : ఈ అయిదు రోజుల్లోనే వీరు 979 మురుగు గుంటల్ని పూడ్చివేశారు; 66,304 ఘనపు మీటర్ల మురుగుమట్టిని త్రవ్వి తీశారు: 797 బావుల్ని శుభ్రపరిచారు 95.676 మీటర్ల పొడవున్న రోడ్డుని మరమ్మతుచేశారు. 7,158 కక్కాసు దొడ్లు కట్టారు; 19.646 పందులదొడ్లు, పశువుల కొట్టాలు కట్టారు. ఈ మహోద్యమంలో పిన్నలు, పెద్దలేకాదు పాల్గొన్నది; స్త్రీలుకూడా ప్రముఖపాత్ర వహించారు. కొన్నిచోట్ల స్త్రీలే ప్రత్యక్షపాత్ర వహించారు.

మరికొన్నిచోట్ల ఈ ఉద్యమానికి నాయకత్వం వహించారు కూడా. ఉదాహరణకు: సేచూవన్ ప్రాంతంలోని చెంగ్‌టో పట్టణంలోని షూయాన్ అనే గొంది "ఆదర్శప్రాంతం" అని పేరుమోగింది. దీనికి నాయకత్వం వహించింది స్థానిక ప్రజారోగ్య సమితి సభ్యురాలైన వూసూచెన్.

ఈ ఉద్యమంలో పిల్లలుకూడా పాల్గొన్నారు. ఉపాధ్యాయుల నాయకత్వాన వీరు ప్రతి సందు మూలనా ఆరోగ్య కేంద్రాల్ని ఏర్పాటు చేశారు. పళ్ళతొక్కలుగాని, ఉమ్మిగాని, యితర చెత్తాచెదారంగాని యిష్టంవచ్చిన చోటల్లా పడవేయకుండా ప్రజల్ని అలవాటు చేసేందుకే వీరీ పనికి పూనుకున్నారు. ఎవరైనా అమ్ముకునే 'అబ్బీ' ఏదైనా నేలమీద పడవేస్తే, అతడి దగ్గరికి వెళ్ళి నెమ్మదిగా యిలా చెప్పేవారు: "సార్! కాస్త దయవుంచి 'దీన్ని' తీసి ఆ చెత్తడబ్బాలో వేస్తారూ" అని మందలించేవారు. ఈ విధంగా పిల్లలంతా కలసి వీధుల్ని శుభ్రంగా వుంచడమేగాకుండా ఎక్కడపడితే అక్కడ వుమ్మివేసే చెడ్డఅలవాటును కూడ మాన్పించగల్గారు. ఒకరికి బోధించడమేకాకుండా తామూ ఈ మంచి లక్షణాల్ని అలవర్చుకున్నారు. ప్రస్తుతానికి 733 కౌంటీలలో ఈ "దుష్టచతుష్టయాన్ని" పూర్తిగా హతమార్చారు.



6 వ ప్రకరణం

# ఇతర రంగాలు

## అడవుల పెంపకం :

చైనా జాతీయార్థికరంగ పునర్నిర్మాణ కార్యక్రమంలో అంటే 1950-'52 సంవత్సరంలో దేశమంతటా 1,662,000 హెక్టార్లలో అడవుల్ని పెంచారు. 1953 నుండి 1957 వరకు అంటే ప్రథమ పంచ వర్ష ప్రణాళికకాలంలో 14.068,000 హెక్టార్లలో అడవుల్ని పెంచారు. అంటే గత 8 సంవత్సరాలలోను మొత్తం 15,730,000 హెక్టార్లలో అడవుల్ని పెంచారన్నమాట. ఈ మొత్తం గతంలో చైనాలోని మొత్తం అడవీ ప్రాంతానికి 15 శాతం ఎక్కువ. గత ఆరు మాసాల్లోను 21.460,000 హెక్టర్ల భూమిని అడవులకు కేటాయించారు. ఈ మొత్తం భూమిలో 13 600.000.000 చెట్లను నాటారు. ఇది చైనా చరిత్రలో ఇంతవరకూ కనీవినీఎరుగనంతటి యత్నం!

ఈ సంవత్సరం అడవుల పెంపకంలో కన్పడిన ప్రధాన లక్షణాలివి: అన్ని ఋతువుల్లోను ప్రజలంతా పెద్ద ఎత్తున పాల్గొని నాణ్యమైన మొక్కల్ని నాటారు. ఇటు పట్టణాలనుంచి అటు గ్రామాలవరకు, నదీలోయ ప్రాంతాలనుంచి మహోన్నత పర్వతప్రాంతాలవరకు - దేశం నాలుగు చెరగులా చెట్లు నాటారు. అడవుల పెంపకం బాగా అభివృద్ధి చెందింది. ఈ కార్యక్రమంలో 130 కోట్ల రోజులు శ్రమపడ్డారు రైతాంగ ప్రజలు. ఈ మహా కార్యక్రమంలో రోజుకి దాదాపు 124,000,000

ప్రజలు పాల్గొన్నారు. ఇంతటి ఉత్సాహం, యింత త్వరితగతిని పని సాగడం యింతకు ముందెన్నడూ ఎరుగమని చైనా ప్రజల అనుభవం చాటిచెప్తోంది. అడవుల పెంపక కార్యక్రమంలో చైనా ప్రజలు అహర్నిశలు పనిచేశారు. ఈ సందర్భంలో పర్వతప్రాంతాల్లో అంగబలం తక్కువగా వుండడంవల్ల, నదీలోయ ప్రాంతాల్లో వున్న ప్రజలంతా కమ్యూనిస్టుపార్టీ పిలుపునందుకొని మహోత్సాహంతో చేతులుకలిపేవారు. ఉదాహరణకు: హొపేరాష్ట్రంలోని షియా-చియా పరిపాలనా ప్రాంతంలో పర్వత ప్రాంతాల్లో అడవుల్ని పెంచే కార్యక్రమంలో దాదాపు 10 లక్షల మంది ప్రజానీకం పాల్గొని దిగ్విజయంగా నెరవేర్చారు.

ఇంతవరకు 367 కేంద్రాలలో, 2,434 పట్టణ ప్రాంతాల్లోను, రోడ్ల ప్రక్కన 19 400 కిలోమీటర్ల పొడవున, నదీ తీరాలపైన 22,000 కిలోమీటర్ల పొడవున చెట్లు నాటడం పూర్తయింది. ఈ విధంగా దేశమంతటా అనేక ప్రాంతాల్లో అడవుల పెంపకం మహోత్సాహంతో కొనసాగింపబడుతోంది. ఉదాహరణకు హూనాన్ రాష్ట్రంలో చీటుంగ్ కౌంటీలో అడవుల పెంపకంకోసమని రాతికొండలపైనున్న చిన్న చిన్న గుహల్ని త్రవ్విపారేశారు. అన్ని అడవుల్లోను చెట్లునాటే కార్యక్రమం సాగిపోతోంది. ఫలితంగా ఈ సంవత్సరం వేసవికాలం లోనే దేశమంతటా 1,200,000 హెక్టర్లలో చెట్లు నాటారు. ఈ శీతాకాలంలో యింతకంటె ఎక్కువ ఏరియాలో అడవుల్ని పెంచే కార్యక్రమాన్ని తీసుకొంటారని ప్రభుత్వ లెక్కలు తెలుపుతున్నాయి. ఇంతకూ ఈ సంవత్సరం 33,000,000 హెక్టార్లలో అడవులు పెంచాలని అంచనా !

అడవుల పెంపకంతోపాటు కలప ఉత్పత్తికిగూడ గొప్ప చర్యలు తీసుకోబడ్డాయి. ఉదాహరణకు ఫ్యూకిన్ రాష్ట్రంలోని చీన్‌యంగ్ కౌంటీలోని సహకార వ్యవసాయోత్పత్తిసంఘంవారు - మంచి విత్తనాల్ని ఎంచుకోవడం ద్వారాను, చెట్లు నాటడం, వాటిపై అజమాయిషీ వుంచే కార్యక్రమాన్ని రెట్టింపు చేయడంద్వారా ఒక్క 20 సంవత్సరాల్లోపే హెక్టర్ ఒక్కింటికి 8,250 నుండి 15 వేల ఘనపు మీటర్ల దేవదారు

కలప తీస్తామని శపథం పూనారు. లోతుదుక్కి దున్నడం ద్వారాను, సకాలంలో సక్రమంగా పైరు వేయడం ద్వారాను 18 సంవత్స రాల్లో ఉత్పత్తిచేసే దేవదారు కలపను ఒక్క 10 సంవత్సరాల్లోనే ఉత్పత్తి చేయగలమని ఇటీవల కీచోరాష్ట్రి ప్రజలు శపథం పూనారు. అలాగే కొన్ని చెట్లనుండి పెద్దఎత్తున అనేక రకాల నూనెనుకూడా తయారు చేస్తున్నారు.

అడవుల్నుంచి ఈ సంవత్సరం లభించిన కలప 476.5 శాతం అధికం అవుతుంది. ఇటీవల వేలకొలది మైళ్ళ రైల్వేలు ఏర్పాటు గావడంవల్ల దూరదూర ప్రాంతాలనుండి కలప రవాణా సులభంగావుం టోంది. ఇటీవల మంగోలియా ప్రజలు కలప మోసుకుపోయేందుకని ఒక రకమైన పెద్దలారీల్ని తయారుచేశారు. ఇవి ఒక్కొక్కటి 2 లక్షల 33 వేల 414 ఘనపు మీటర్ల కలపవరకు మోసుకుపోగలదు. ప్రజా ప్రభుత్వం నాయకత్వాన యింతవరకు మొత్తం 38,331,000 హెక్టార్లలో అడవుల్ని పెంచడం జరిగింది. వచ్చే 12 సంవత్సరాలలోను 100,000,000 నుండి 200,000,000 హెక్టార్లలో అడవుల్ని పెంచాలని చైనా ప్రభుత్వ సంకల్పం !!

## చేపల పరిశ్రమలు

1952 లో వివిధ రకాల చేపలనుండి ఉత్పత్తయిన పదార్థాలు (ఎక్వాటిక్ ప్రోడక్ట్సు) 16 లక్షల 60 వేల టన్నులు. ఇవి విముక్తికి ముందుకన్నా లక్షన్నర టన్నులు అధికం. 1957 లో 29 లక్షల 50 వేల టన్నులు ఉత్పత్తి అయినాయి. గత 5 సంవత్సరాలలోను, ప్రతి సంవ త్సరం చేపలనుండి లభించే పదార్థాలు 2 లక్షల 60 వేల టన్నులు అద నంగా ఉత్పత్తి అయినవి. అంటే, సంవత్సరానికి 12% అభివృద్ధి అన్నమాట. ఇదేకాలంలో జపానులో సాంవత్సరిక అభివృద్ధి 6%, అమెరికా 6.2% బ్రిటన్‌లో 2.1% మాత్రమే అదనంగా చేపల సరుకు ఉత్పత్తి అవుతూండేది.

నానాటికి పెరుగుతున్న ప్రజల అవసరాల దృష్ట్యా చైనా ప్రజలు వచ్చే 5 సంవత్సరాలపాటు ఈ విషయంలో బాగా కష్టించి పనిచేయ

డానికి సిద్ధపడుతున్నారు. వచ్చే సంవత్సరానికి చేపలనుంచి లభించే పదార్థాల్ని ఉత్పత్తి చేయడంలో ప్రపంచంలోనే చైనా ప్రథమ స్థానాన్ని అందుకోనున్నది। ద్వితీయ పంచవర్ష ప్రణాళికాంతానికి చేప పదార్థాల ఉత్పత్తి 2 కోట్ల టన్నులకు పెరుగుతుందని అంచనా. వచ్చే 5 సంవత్సరాల్లోను సాలుసరి సగటు ఉత్పత్తి 34 లక్షల టన్నులకు పెరుగుతుంది. ఈ సంవత్సరం ఉత్పత్తికావాల్సిన చాప పదార్థాలు 50 లక్షల టన్నులు. ఈ మొత్తం 1959 నాటికి 80 లక్షలకు పెరుగుతుంది. ఈ మొత్తం ప్రపంచ రికార్డ్ జపాన్ ఉత్పత్తిని మించిపోతుంది. దాని స్థానే చైనా ప్రథమ స్థానాన్ని అలంకరిస్తుంది.

చైనాలో చేపల పరిశ్రమాభివృద్ధికి సంబంధించిన మంచి వనర్లున్నాయి. చేపలుపట్టే ప్రాంతం దాదాపు 4 లక్షల 30 వేల చదరపు మైళ్ళు వుంటుంది. చైనాతీర ప్రాంతంలో చేపలు పట్టేందుకు అనువైనవి 6 ప్రధాన కేంద్రాలున్నాయి: పోహాగల్ఫ్; తాషా, చౌషాన్, తూర్పు క్వాంగ్‌టుంగ్, పశ్చిమ క్వాటుంగ్‌ంగ్, పీహూవాన్‌లు. ఇవిగాక చిన్నవిగాని పెద్దవిగాని అనేక కేంద్రాలున్నాయి.

చేపల పరిశ్రమ దేశంలో అనేక ప్రాంతాల్లో అభివృద్ధిచెందుతోంది. ఉదాహరణకు : హూపే రాష్ట్రంలో చేపలుపెంచే ప్రాంతం ఈ సంవత్సరం 5 లక్షల 30 వేల హెక్టార్లకు పెంచబడింది. అలాగే హోనాన్, హూనాన్, కియాంగ్సీ అన్వీ రాష్ట్రాల్లోకూడా చేపల పెంపకం బాగా అభివృద్ధి చెందుతోంది. వీటి పెంపకంలో సహకార వ్యవసాయ సంఘాల పాత్రకూడా వుంది.

అలాగే చైనాలో చాలాచోట్ల సముద్ర సంబంధమైన ముత్యపు చేపలనుండి కృత్రిమంగా అనేక పదార్థాల్ని తయారుచేయడం కూడా జరుగుతోంది.

ఈ కార్యక్రమం అంతా సవ్యంగా జరిగేందుకై లోగడవున్న కొయ్యపిన్నీసులు, పడవలు మొదలైనవాటిస్థానే యిప్పుడు స్టీమర్లను మోటారు బోట్లను విరివిగా వాడుతున్నారు.

# క్రీడారంగం

చైనాలోని పట్టణాలలోను, అనేక గ్రామీణ ప్రాంతాలలోను క్రీడాభివృద్ధికి అనేక చర్యలు తీసుకోబడ్డాయి. ఉదాహరణకు: హోపే రాష్ట్రంలోని పావోటింగ్ ప్రాంతంలోని క్రీడా కేంద్రాలలో నూటికి నూరు మంది విద్యార్థులు పాల్గొంటున్నారు. (జబ్బుగా వున్నవారు మినహాయించి) మరో 90 శాతం కార్యాలయాల్లో పనిచేసే కార్యకర్తలు పాల్గొంటున్నారు. చేతివృత్తులవారు, అలాగే ఫ్యాక్టరీ, కర్మాగారాల్లో నూటికి 80 మంది, యితరత్రా కుర్రకారు, రేడియో ప్రసార కార్యక్రమం లోనో, బంతి ఆటల్లోనో, ఈతలోనో లేదా యితర ఆటపాటల్లోనో పాల్గొంటున్నారు. వ్యవసాయోత్పత్తిలో వచ్చిన అమోఘ విజయాలతో గ్రామీణ ప్రాంతాల్లో క్రీడోత్సవాలకి అంతేలేదు. ఉదాహరణకు: షాంటింగ్ రాష్ట్రంలోని కావోటింగ్ కౌంటీలోని 20 జిల్లాలకు చెందిన 127 సహకార క్షేత్రాలవారు కలసి స్వంతంగా క్రీడా కేంద్రాల్ని (క్లబ్బులు) నెలకొల్పుకున్నారు. 1309 ఆటల గ్రూపులు క్రింద ఏర్పడ్డాయి. చిన్నచిన్న ఆటస్థలాల్ని ప్రతిఒక్క జిల్లాలోను, సహకార వ్యవసాయ క్షేత్రాల ప్రాంతంలోను ఏర్పడ్డాయి. వీటిలో ప్రతి రోజూ 40 వేల మంది వ్యవసాయ కార్యకర్తలుగాని, రైతులుగాని ఆటల్లో పాల్గొంటూవుంటారు. మొత్తం 23 జిల్లాల్లో స్వంతంగా ఆటల క్లబ్బులు ఏర్పరచుకున్నారు. ఇది లియోనింగ్ రాష్ట్రంలోని 'పేపియావో' కౌంటీ మాట. మొత్తం కౌంటీ అంతటా కలిపి 1100 ఉత్పత్తిదళాలు (టీములు) ఏర్పడ్డాయి. ఈ దళాలన్నింటిలోను కలిపి 30 వేల మంది సభ్యులున్నారు. ఆ విధంగా ఒకనాడు నిత్యదారిద్ర్యంతో క్రుంగిపోయిన 50 కోట్ల చైనా రైతాంగ ప్రజలు నేడు ఆటపాటల్లో మునిగి తేలుతున్నారు. ఎంతలో ఎంతమార్పు!

1957 సంవత్సరాంతానికి చైనాలో 6 శారీరక శిక్షణ (Physical culture colleges) కళాశాలలు; మధ్యతరహా శిక్షణాపాఠశాలలు 11; పనిపాటలయింతర్వాత యువజనులకై ఏర్పడ్డ శిక్షణాకేంద్రాలు 159 వున్నాయి. గత 9 మాసాల్లోనూ 15 రాష్ట్రాల్లోనూ, పట్టణాలలోనూ 10

శిక్షణా కళాశాలల్ని నెలకొల్పడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. అలాగే మరో 12 కొత్త సెకండరీ శిక్షణా పాఠశాలలను నెలకొల్పబోతున్నారు. 19 రాష్ట్రాల్లోను పట్టణాల్లోను కలిపి యింతవరకు విశ్రాంతి సమయంలో యువజనుల నిమిత్తమై 8,095 శిక్షణాపాఠశాలలు నెలకొల్పారు. అంటే 1957 నాటికన్నా 50 శాతం అభివృద్ధి అన్నమాట. ఒక్క టీన్‌సిన్ రాష్ట్రంలోనే విశ్రాంతి సమయంలో యువజనుల శిక్షణకై 1097 పాఠశాలలు నెలకొల్పబడ్డాయి. కొన్నికొన్ని కౌంటీలలో 100 నుండి 200 పాఠశాలల వరకుకూడా నెలకొల్పుతున్నారు.

1958 జూన్ నెలాఖరుకు - బరువులెత్తడంలోగాని, ఈతపోటీలోగాని, ట్రాక్ అండ్‌ఫీల్డ్, సైకిల్ త్రొక్కడం మొదలైన ఆటలపోటీలలో 65 జాతీయ రికార్డులు స్థాపించబడ్డాయి. వెయిట్‌లిఫ్టింగ్‌లో (తేలికబరువు నెత్తడంలో) హూయంగ్ చియాంగ్ - హూయీ, జెర్క్‌లో 155 కిలోగ్రాములు ఎత్తి ప్రపంచ రికార్డు స్థాపించాడు. జూలైలో చైనా వెయిట్‌లిఫ్టింగ్ టీము ప్రఖ్యాతి చెందిన ఐక్యఅరబ్ రిపబ్లిక్ టీముపైన 5-2 గెలిచి గొప్ప విజయాన్ని సాధించింది (ఈ పోటీ పెకింగ్‌లో జరిగింది). అలాగే "ట్రాక్ అండ్ ఫీల్డ్" పోటీలో చైనా యువకులు ఘన విజయాల్ని సాధించారు. యువకులతోపాటు ఆడపిల్లలుకూడా క్రీడారంగంలో బహుముఖప్రజ్ఞ కనబరుస్తున్నారు. ఉదాహరణకు : ప్రఖ్యాత చియాంగ్ యూమిన్ తను లోగడ స్థాపించిన రికార్డునే 100 మీటర్ల పరుగును 11.9 సెకండ్లలో పూర్తి చేయడంతో అధిగమించ గలిగింది. స్త్రీల ఆటలపోటీ లన్నింటిలోనూ చైనా స్త్రీలు స్థాపించిన రికార్డులు ఆసియాలోకే ఉత్తమమైనవిగా వున్నాయి.

చైనా టేబిల్‌టెన్నిస్ ఛాంపియన్ వాంగ్ చువాన్ - యావో. యూరప్ ఛాంపియన్ అయిన బెర్జిక్ (హంగరీ) తో నాలుగుసార్లు పోటీ చేసి నాలుగుసార్లూ గెలుపొందాడు. మాస్కోలో జరిగిన అంతర్జాతీయ టేబిల్‌టెన్నిస్ పోటీలో సింగిల్స్‌లో గెలుపొందాడు. చైనా ఫుట్‌బాల్, వాలీబాల్, బాస్కట్‌బాల్ టీములుకూడ అంతర్జాతీయంగా చాలా విజయాలు సాధించాయి.

ఈ సంవత్సరం జూలై మాసాంతానికి, 107 గురు కొత్త క్రీడాకారులకు చైనా ప్రభుత్వం "మాస్టర్ స్పోర్ట్స్‌మన్" అనే బిరుదుల్ని బహూకరించింది.

## సాహిత్యం, కళల వికాసం

పారిశ్రామిక. వ్యవసాయ రంగాలతో సరిసమానంగానే చైనా దేశపు సాహిత్యము. కళలు గత సంవత్సరం మహోభ్యున్నతిని పొందాయి.

300 కొత్త నవలలు, ఇతర సాహిత్య రచనలు 1 కోటి 60 లక్షల ప్రతులు గత జనవరి మాసంనుండి యిప్పటి వరకు ప్రచురించబడ్డాయి. గత సంవత్సరం అంతటితో పోల్చిచూస్తే కొత్త నవలల సంఖ్య 50 శాతం, ప్రతుల సంఖ్య నాలుగు రెట్లకు పెరిగింది.

పాత నవలలతోసహా 7 కోట్ల ప్రతులు సాహిత్య గ్రంథాలు ఈ సంవత్సరం ప్రథమార్థభాగంలో అమ్ముడుపోయాయి.

నూతనంగా ప్రచురించబడిన సాహిత్య గ్రంథాలలో చాలా భాగం ప్రజల విప్లవాత్మక ధైర్యసాహసాలనూ, విప్లవాత్మక సంఘటనలనూ చిత్రించే నవలలూ, చిన్న కథలు. కవిత్వం, జీవిత చరిత్రలు. పాఠకులపైన అవి గొప్ప ప్రభావాన్ని కలుగజేస్తున్నాయి.

అనేకమంది నాటక రచయితలు. సంగీత విద్వాంసులు. చిత్రకారులు తమ కృషి ద్వారా ప్రస్తుత రాజకీయ పోరాటాలకు, జాతీయ నిర్మాణ కార్యకలాపాలకూ అత్యంత దోహదంచేశారు. పెకింగ్‌లోని నాటక సమాజాలు నాలుగు మాసాల్లోనే 230 కు పైగా కొత్త నాటకాలను ప్రదర్శించాయి. దేశంలో సోషలిస్టు విద్యా ఉద్యమం ఉధృతంగా సాగుతున్న రోజుల్లో "ఎర్రతుఫాను" అన్న విప్లవాత్మక చారిత్రక నాటకం 200 సార్లు ప్రదర్శింపబడింది. అనేక మంది సంగీత విద్వాంసులు వ్యవసాయ రంగంలోని మహత్తరాభివృద్ధిని గురించీ, శాంతి కోసం జరుగుతున్న పోరాటాన్ని గురించీ అనేక పాటలను వ్రాశారు. "ఉత్తమమైన సోషలిజం" "విప్లవాత్మక శక్తిని ప్రదర్శిద్దాం" "తైవాన్‌ను

విముక్తి గావిద్దాం" అన్న పాటలు నేడు దేశమంతటా మారుమ్రోగుతున్నాయి.

తైవాన్‌ను విముక్తి గావించేందుకు చైనా ప్రజల్లో ప్రబలమవుతున్న మనోనిశ్చయాన్ని ప్రతిఫలింపజేసే అనేక పోస్టర్లు, వ్యంగ్య చిత్రాలు, తైవాన్ విషయమై ప్రధాని చౌ - ఎన్ - లై ప్రకటన గావించిన కొద్ది గంటల్లోనే రాజధాని వీధుల్లో ప్రత్యక్షమయ్యాయి.

అనేక మంది చిత్రకారులు, తదితర కళాకారులు మింగ్ గోరీల రిజర్వాయర్ ప్రాజెక్టులలో తాము స్వయంగా పాల్గొన్న అనుభవాలను పురస్కరించుకొని యెన్నెన్నో కళాఖండాలను సృష్టించారు. గ్రామాలలోను, ఫ్యాక్టరీలలోను పనిచేయడానికి వెళ్ళిన చిత్రకారులు చైనా ప్రజల కమ్యూనిస్టు ఉత్సాహాన్ని చిత్రించే వేయికిమించిన చిత్రాలను సాంప్రదాయకమైన చైనా పద్ధతుల్లో చిత్రించారు.



# పత్రికల వ్యాఖ్యలు

## "లండన్ అబ్జర్వర్"

చైనా పంటల్నిగూర్చి లండన్ 'అబ్జర్వర్' లో డెన్నిస్ బ్లడ్‌వర్త్ వ్రాసిన విషయాల్ని "హిందూస్థాన్ టైమ్స్" (24-9-58) పత్రిక ప్రకటించింది : "బంజర్లను సాగులోనికి తెచ్చేదానికంటే, ప్రస్తుతం సాగవుతున్న భూమిలో ఉత్పత్తి నధికం చేయడంపైననే చైనా ఆధారపడుతోంది. ఇప్పుడు ఎకరానికి 3 వేల పౌనుల చొప్పున (అంటే 166 పౌన్ల బరువుగల బస్తాలు 1 8/4) పండే గోధుమను 1959 నాటికి నాలుగు రెట్లు ఎక్కువ చేయాలని సంకల్పిస్తున్నట్లు సహకార వ్యవసాయశాఖ డైరెక్టర్లు నాతో చెప్పారు. ఈ యేడు ఎ 1కి 3600 పౌనుల చొప్పున (అంటే 166 పౌన్ల బరువుగల బస్తాలు 21¾) పండిన మొదటి వరిపంట, రెండో పంటనాటికి ఎ 1కి 18 వేల పౌనుల చొప్పున (అనగా 108¾ బస్తాలు) పండుతుంది.

"ఉత్పత్తిని అధికంచేయాలని వారి లక్ష్యం, అందుకుగాను నీటి వనరులను పుష్కలంగా పెంపొందించారు. ఒకే భూమిలో రెండు పంటలు వరి, ఒక పంట గోధుమ పండిస్తున్నారు.

"నిరుడు ఎకరానికి 5 వేల పౌనుల చొప్పున పచ్చి ఎరువువేస్తే, 1959 లో 12 లక్షల పౌనులు వేయబోతున్నాం. నిరుడు ఎ 1 కి 50 పౌన్ల విత్తనాలు వేస్తే 1959 లో 260 పౌన్లకు మించి వేయబోతున్నాం." అని వ్యవసాయ శాఖాధికారులు నాతో చెప్పారు.

## మన దేశంలోని ప్రముఖ ఆంగ్ల దినపత్రిక "టైమ్స్ ఆఫ్ ఇండియా" సంపాదకీయ వ్యాఖ్య

"చైనా నేడు నిరంతర విప్లవదశలో మునిగివుంది. సంస్కరణల వెల్లువ నేడు చైనా అంతటా కానవస్తుంది. అతిసమర్థవంతమైన, శక్తి

వంతమైన అనేక మార్పులు వచ్చాయి. ఇంతటి బ్రహ్మాండమైన విప్లవకర మార్పులు ఉత్పత్తి అభివృద్ధికే దోహదం చేశాయి....ఈ సంవత్సరం గ్రామీణ ప్రాంతాలన్నిటా కనీవినీ ఎరుగని మార్పులు వచ్చాయి. అన్నింటికంటే ప్రధాన విషయమేమంటే - సహకార వ్యవసాయ క్షేత్రాల దశనుండి ప్రజా కమ్యూన్ల దశకు మారుతున్న ఈ తరుణంలో చైనా ప్రజల్లో ఎట్టి వ్యతిరేకతలేదు. పైగా ఈ విషయంలో చైనా కమ్యూనిస్టులు ఎట్టి ఒత్తిడి ప్రయోగించినట్లుగాని నిదర్శనంలేదు. దీన్నిబట్టి "కార్య విధాన సంస్కరణోద్యమం" (Rectification Campaign) అంచనాలకు మించి సత్ఫలితాలనిచ్చినట్లు, విజయవంతమైనట్లు కనబడుతోంది."

## ఫ్రెంచి నిపుణుడు డూమాంట్ వ్యాఖ్య :

"ప్రపంచ వ్యవసాయ చరిత్రలోనే యిది మహాద్భుత విషయం. చైనాలాంటి పెద్ద దేశంలో వ్యవసాయోత్పత్తి ఒక్క సంవత్సరంలో నూటికి 70 వంతులు పెరగడమంటే నిజంగా మహాద్భుతం" అని ఫ్రెంచి జాతీయ వ్యావసాయిక సంస్థకు చెందిన వ్యవసాయ నిపుణుడు ప్రొఫెసర్ రెనీ డూమాంట్ "లీమాండీ" అనే పత్రికలో వ్రాశారు. ఈయన ఇటీవలనే చైనా పర్యటించి వచ్చారు.

"చైనా వ్యవసాయాభివృద్ధిలో అసాధారణ విజయాలు" అను శీర్షిక క్రింద వ్రాసిన వ్యాసంలో డూమాంట్ ఈ క్రింది విషయాలను తెలియజేశారు: "ఒక్క 1957-'58 సంవత్సరకాలంలోనే నీటిపారుదల కల్పించబడ్డ భూమి 7 కోట్ల 50 లక్షల ఎకరాలు. అంటే 15-18 మాసాలలో ఇరిగేషన్ సౌకర్యాలు కల్పించబడ్డ భూమి గత 2 వేల సంవత్సరాలలో సాగైన భూమికన్నా ఎక్కువన్నమాట. అంతేగాదు, ఎంతో యంత్రాభివృద్ధి పొందిన అమెరికా శతాబ్దంకాలంలో ఇరిగేషన్ సౌకర్యాలు కల్పించిన 3 కోట్ల 50 లక్షల ఎకరాలకన్నా రెట్టింపు అన్నమాట!"





ఆ కొండపైకెక్కె నాడూ

ఉ ద్యో గి

బోయీల భుజమెక్కి ఇట్లు



ఆ కొండపై నాటె నేడూ

ఉ ద్యో గి

అందాలుచిందేటి చెట్లూ





మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA107B219 |
| పుస్తకం పేరు | చైనా మహత్తర విజయాలు |
| తారీఖు | 10 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1,A,BC1,36B,36D,36F,36H |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rohith |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |